# శ్రీ బహుధాన్యనామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గమ్, 1998-99




ప్రచురణ :

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

శ్రియైనమః

శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరాభ్యాం నమః

శ్రీమద్విఖనసమహాగురుభ్యో నమః

# శ్రీ బహుధాన్యనామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గమ్

## 1998-99

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాన్తి,

శ్రీ తంగిరాల ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతిగారిచే విరచితము.




తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన పణ్డితులు

అప్పికట్ల శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులవారిచే పరిష్కృతము

తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

మహారాజశ్రీ ఎమ్.కె.ఆర్. వినాయక్, ఐ.ఏ.ఎస్., గారిచే ప్రకటింపబడినది.

తిరుపతి

1998

## శ్రీ వేంకటేశ భగవాన్



ఓమ్ ॥ మత్పాదౌ శరణం వ్రజేతి చరణౌ సంసారసిన్ధుస్తదా
జానుం సంస్పృశతీతి జానుమపి పాణిభ్యాం స్వయం దర్శయన్ ।
శేషాద్రౌ జగతోఽస్య రక్షణధియాఽతిష్ఠద్దయా సాగరః
పశ్చ్యైయాంపి చతుర్భుజః కలయతాం శ్రీ శ్రీనివాసః ప్రభుః ॥

కీ.శే. శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః
తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాన్.

# శ్రీ బహుధాన్యనామ సంవత్సర

# సిద్ధాన్త

# పంచాఙ్గ పీఠికా



పంచాంగకర్త :

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థానసిద్ధాంతి అగు

కీ॥ శే॥ దైవజ్ఞశేఖర బ్రహ్మశ్రీ తంగిరాల చినహనుమత్సిద్ధాంతిగారి కుమారుడు

**శ్రీ ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతి**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి, STD: 08819 ఫోన్: 55364

(శ్రీ పూర్ణ జ్యోతిర్నిలయం)

రేలంగి - తణుకు తాలూకా,

పశ్చిమ గోదావరిజిల్లా (ఆంధ్ర).

# శ్రీ పద్మావతీ దేవి



ఓమ్॥ ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్స్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

శ్రియైనమః

శ్రీనివాసాయ నమః

శ్రీమద్విఖనసమహాగురుభ్యో నమః

# శ్రీమద్బహుధాన్యనామ సంవత్సర పంచాఙ్గ విషయసూచికా

* * *



శ్రీరస్తు
శ్రీ లక్ష్మీ వేంకటేశః ప్రసన్నో భవతు
శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# పీఠికారంభః

ఓమ్ ॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥
యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాఃపరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥
శ్రీమాన్ శ్రీశేషపృథ్వీ ధరశిఖరపరిస్పందిపాదారవింద-
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్సాన్తనస్సంత నోతు ।
లక్ష్మీం లక్ష్మీ వియోగాసహనిజహృదయఃకోఽపి కారుణ్యపూర్ణో
దేవధీశఃప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో నః ॥
కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠ ముదారహారమ్ ।
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్ ॥
మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే ॥
శ్రీ విష్ణుచిత్తకుల నందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందన యోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ॥
విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।
కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్ ॥
ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః ।
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ।
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః ।
ధైర్యం రాహుశ్చకీర్తిం సకలశుభ యుతాం కేతురిష్టార్థసిద్ధిమ్ ॥

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ । వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥
శ్రీ వేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ । నమస్కృత్యహృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥
సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః। దద్యుర్మనోరథం సర్వం దేవతాఃఫలముత్తమమ్॥
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్ । చంద్రార్కౌ తత్రసాక్షిత్వం భజేతేనిశ్చలంయతః॥
యధాశిఖామయూరాణాంనాగానాంమణయోయథా । తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్ని సంస్థితమ్॥

శ్రీవత్స జన్మాఽఖిల సౌరతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిర్హి నామాన్ ।
శ్రీ తంగిరాలాన్వయజోఽహమార్యఃశ్రీ శేషశైలేశ కృపావిశేషః ॥
సోహం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్ ।
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు ॥

గురువందనమ్

దైవజ్ఞ ప్రథమస్య పూర్ణ యశస్శ్రీబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీ పిడపర్తి వంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ ।
సూర్యార్యాది పురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్త్రిస్కంధాంబుధిపారగం మమ గురుం వందే సదాశ్రేయసే ॥

దైవజ్ఞ ప్రశంసా, దైవజ్ఞ నివాసః

శ్రీ వేంకటేశా ప్పన్నృసింహతాట కేశాదిదేవై రభిరక్ష్యమాణమ్ ।
గోదావరీ పశ్చిమయోజనాంత శ్రీగోస్తనీతీర విరాజమానమ్ ॥
శ్రీవేదవేదాంగ విదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండిలైశ్చ ।
ఈడ్యైర్వదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్ ॥

యద్వంశే బహవశ్శ్రుతిస్మృతివిధౌ సజ్జ్యోతిషే పండిలాః
శ్రీవత్సాభిధగోత్రజాస్త దనుమత్ప్రైతామహోఽత్యంతధీః ।
శ్రీమత్పండిత సార్వభౌమ హనుమాన్వేదార్థవిత్సాత్త్విక-
స్తత్తత్కర్మసుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా ॥

తస్యాత్మజో వేంకటకృష్ణ సోమయాజీసుసిద్ధాన్తవిదగ్రగణ్యః
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ
జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వైతీయీకస్తు పూర్ణదైవజ్ఞః
తార్తీయోఽహం హనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః

చత్వారస్తనూజాః హనుమత్సిద్ధాంతినః తృతీయస్తేషు
ప్రభాకరపూర్ణశర్మాహం శ్రీనివాసకరుణాకాంక్షీ
అసూర్యం చ్యవనోంగిరోఽత్రి ముఖరానభ్యర్చ్యమాన్యాన్మునీ
నాచార్యానపరాన్మయా సుమనసా శ్రీతాతపాదం గురుమ్
పంచాంగం విరచయ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
సశ్శ్రేయాంసి దయామయః కలయ తాం శ్రీ వేంకటేశః ప్రభుః

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి.

# అథ బ్రహ్మణః ఆయుః ప్రమాణాదికం

శ్రీమద్భగవద్దివ్యనాభికమల జాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుః వర్ష శతమేవ । తత్ప్రమాణ సౌరాబ్దాః 31104000 కోట్లయః । ద్వితీయ పరార్థే ప్రథమవాసరే గతఘటికాదయః ఘడి 17 విఘ 42 ప్రాణవాల (0) గుర్వ క్షరోచ్ఛారకాలః 3 నిమేషః 19౦వ త్రుటయః 3 సంప్రతి చతుర్దేశుటౌ గతసౌర మాసాదయః 2,14,27,32 ఇదానీం శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః సప్తమే వైవస్వత మన్వంతరే 27 మహాయుగాని గతాని. అథ 28 తమే మహాయుగే వర్తమానం కలియుగం వ్యవహ్రియతే.

"యుగంభవేత్ వత్సర పంచకేన యుగాని తు ద్వాదశ వర్షషష్ట్యాం" అను ప్రమాణముచే ప్రభవాది 5 సం॥ రములు ఒక యుగము చొ॥న (5X12=60) 12 యుగములుగా నగుచున్నది. ఇట్లుగ కృష్ణయజుర్వేద తైత్తిరీయ బ్రాహ్మణము 10 ప్ర॥ పాఠకము, 4వ అనువాకము చెప్పుచున్నది.

1 2 3 4 5

సంవత్సరోఽసి, పరివత్సరోఽసి, ఇదావత్సరోఽసి, ఇదువత్సరోఽసి, ఇద్వత్సరోఽసి

॥ ఇతి ॥ ఇందులకు విద్యారణ్య భాష్యము.

ప్రభవాదిషు షష్టి సంవత్సరేషు ఏకైకస్మింశ్చక్రమేణ సంవత్సర పరివత్సరాది శబ్దాః వర్తన్తే .............................హే అగ్నేత్వం సంవత్సరోసి ప్రభవాది రూపోసి, పరివత్సరోసి -- విభవ రూపోసి, ఇదావత్సరోసి - శుక్లరూపోసి, ఇదువత్సరోసి - ప్రమోదరూపోసి, ఇద్వత్సరోసి - ప్రజాపతిరూపోసి, పంచస్వేతేషు అనుగతాకారః వత్సరః ఏతద్రూపోసి.

ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం.

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "1. సంవత్సరము, 2. పరివత్సరము, 3. ఇదావత్సరము, 4. ఇదువత్సరము, 5. ఇద్వత్సరము" అను నామములు కలవై యున్నవి. ఇటులనే ప్రతి అయిదు సంవత్సరములకు నామములు తెలియదగియున్నవి. ఇప్పుడు ఇంద్ర దేవతాకమగు తృతీయ యుగమున (వర్తమానమున పంచవత్సరాత్మకమగు తృతీయ యుగమున) 2వది అగు సూర్యదేవతాక, పరివత్సర నామముగల ఈ బహుధాన్య నామ సం॥రమునందు యవ (గోధుమ) దానము విశేష పుణ్య ఫల ప్రదము.

దయా సముద్రుడగు శ్రీ వేంకటేశప్రభువు అన్నియును శుభప్రదములుగను, సుఖప్రదములుగను ఉండునట్లు అనుగ్రహింతురుగాక.

# శ్రీ తిరుపతి (వేంకటాద్రి) నగర్యాః

విషువచ్ఛాయాంగుళాని 2-55 అక్షాంశాః + 13.44

భూమధ్యాత్ దేశాంతరకాలః ఘ॥ 0-29 గం. + 0-12 ని॥లు

అయనాంశాః భా. 23-49.50

స్ఫుటలగ్న ప్రమాణ, పుష్కరకాలా:

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషస్య | 4-28 | = 3-7 | తులాయాః | 5-18 | = 4-14 |
| వృషభస్య | 5-4 | = 2-22 | వృశ్చికస్య | 5-31 | = 1-17 |
| మిథునస్య | 5-30 | = 4-24 | ధనుషః | 5-19 | = 3-43 |
| కర్కాటకస్య | 5-28 | = 1-16 | మకరస్య | 4-44 | = 2-13 |
| సింహస్య | 5-10 | = 3-38 | కుంభస్య | 4-14 | = 3-23 |
| కన్యాయాః | 5-6 | = 2-23 | మీనస్య | 4-8 | = 0-58 |

ఈ లగ్న ప్రమాణములు ఈ కాలమునకు తిరుపతికి చేయబడినవి. ఇవియే స్ఫుటలగ్న ప్రమాణములుగ గ్రహింపవలెను. తిరుపతి ప్రాంతంలోని అలవాటులో ఉన్న పాతలగ్న ప్రమాణములు ప్రాచీనకాలములో సాధించబడినందున పరిగ్రాహ్యములు గావు.

### తిరుపతి నుండి రాజమండ్రికి దేశాంతరకాలము

| సాయనమాసము | మేష | వృషభ | మిథున | కర్కాటక | సింహం | కన్యా |
|---|---|---|---|---|---|---|
| | + ౩౨ | + ౩౯ | + ౪౫ | + ౪౮ | + ౪౫ | + ౩౯ |
| | తులా | వృశ్చిక | ధనుః | మకర | కుంభ | మీన |
| | + ౩౨ | + ౨౪ | + ౧౬ | + ౧౯ | + ౧౬ | + ౨౪ |

పై సంస్కార విఘడియలను తిథ్యాధికమునందు మేషాది సాయన మాసారంభ దినమున సంస్కరింపగా రాజమండ్రికి సూర్యోదయాది కాలమగును. మాసాది నుండి తిరిగి మాసాంతము వరకు అనుపాతముచే మధ్యదినము లందు సంస్కరింపవలెను.

పరమ దినప్రమాణం 32-3, పరమ క్షయదిన ప్రమాణం 27-57

# తిరుపతి (వేంకటాద్రి) ప్రాంతమందు సూర్యోదయాస్తమయ కాలములు

| 1998 సం॥ | తేది | సూ. ఉ. గం.-ని. | సూ. అ. గం.-ని. | 1998-99 సం॥ | తేది | సూ. ఉ. గం.-ని. | సూ. అ. గం.-ని. |
|---|---|---|---|---|---|---|---|
| మార్చి 1998 | 29 | 6-14 | 6-20 | | 30 | 6-06 | 6-01 |
| ఏప్రిల్ | 1 | 6-12 | 6-20 | అక్టోబర్ '98 | 1 | 6-06 | [illegible] |
| | 5 | 6-09 | 6-21 | | 5 | 6-06 | 5-57 |
| | 10 | 6-05 | 6-22 | | 10 | 6-07 | 5-54 |
| | 15 | 6-03 | 6-22 | | 15 | 6-08 | 5-51 |
| | 20 | 5-59 | 6-23 | | 20 | 6-08 | 5-48 |
| | 25 | 5-57 | 6-24 | | 25 | 6-08 | 5-46 |
| | 30 | 5-55 | 6-24 | | 30 | 6-10 | 5-54 |
| మే | 1 | 5-54 | 6-24 | నవంబర్ | 1 | 6-11 | 5-43 |
| | 5 | 5-53 | 6-25 | | 5 | 6-12 | 5-41 |
| | 10 | 5-51 | 6-27 | | 10 | 6-14 | 5-39 |
| | 15 | 5-50 | 6-28 | | 15 | 6-16 | 5-39 |
| | 20 | 5-49 | 6-30 | | 20 | 6-18 | 5-38 |
| | 25 | 5-48 | 6-31 | | 25 | 6-21 | 5-38 |
| | 30 | 5-48 | 6-32 | | 30 | 6-24 | 5-39 |
| జూన్ | 1 | 5-48 | 6-33 | డిసెంబరు | 1 | 6-24 | 5-39 |
| | 5 | 5-48 | 6-34 | | 5 | 6-26 | 5-40 |
| | 10 | 5-48 | 6-36 | | 10 | 6-29 | 5-42 |
| | 15 | 5-49 | 6-37 | | 15 | 6-32 | 5-44 |
| | 20 | 5-50 | 6-38 | | 20 | 6-34 | 5-46 |
| | 25 | 5-51 | 6-38 | | 25 | 6-37 | 5-49 |
| | 30 | 5-52 | 6-40 | | 30 | 6-40 | 5-52 |
| జూలై | 1 | 5-52 | 6-40 | జనవరి '99 | 1 | 6-40 | 5-52 |
| | 5 | 5-54 | 6-40 | | 5 | 6-42 | 5-56 |
| | 10 | 5-55 | 6-40 | | 10 | 6-43 | 5-58 |
| | 15 | 5-56 | 6-40 | | 15 | 6-44 | 6-01 |
| | 20 | 5-58 | 6-40 | | 20 | 6-45 | 6-04 |
| | 25 | 5-59 | 6-39 | | 25 | 6-45 | 6-07 |
| | 30 | 6-00 | 6-38 | | 30 | 6-44 | 6-08 |
| ఆగష్టు | 1 | 6-00 | 6-37 | ఫిబ్రవరి | 1 | 6-44 | 6-10 |
| | 5 | 6-01 | 6-36 | | 5 | 6-43 | 6-11 |
| | 10 | 6-02 | 6-34 | | 10 | 6-42 | 6-14 |
| | 15 | 6-03 | 6-31 | | 15 | 6-40 | 6-15 |
| | 20 | 6-04 | 6-28 | | 20 | 6-38 | 6-16 |
| | 25 | 6-04 | 6-26 | | 25 | 6-35 | 6-17 |
| | 30 | 6-05 | 6-22 | మార్చి | 1 | 6-32 | 6-18 |
| సెప్టెంబరు | 1 | 6-04 | 6-21 | | 5 | 6-30 | 6-18 |
| | 5 | 6-05 | 6-18 | | 10 | 6-27 | 6-19 |
| | 10 | 6-05 | 6-16 | | 15 | 6-24 | 6-20 |
| | 15 | 6-06 | 6-12 | | 20 | 6-20 | 6-20 |
| | 20 | 6-06 | 6-08 | | 25 | 6-17 | 6-20 |
| | 25 | 6-06 | 6-04 | | 30 | 6-14 | 6-20 |

శ్రీ మహాగణపతయేనమః

# నిత్యధ్యాన శ్లోకములు

## శ్రీ గణేశ స్తోత్రం

శ్లో॥ శ్రీమద్గణేశం విధిముఖ్య వంద్యం గౌరీసుతం విఘ్నతమోదినేశం ।
కళ్యాణ సంవర్థిత భక్తలోకం సర్వార్థ సిద్ధ్యర్థమహం భజామి ॥

## శ్రీ సరస్వతీ స్తోత్రం

శ్లో॥ సరస్వతీ త్వియందృష్ట్వా । వీణాపుస్తకధారిణీ ।
హంసవాహన సంయుక్తా । విద్యాదానకరీమమ ॥

## శ్రీ వేంకటేశ్వర స్తోత్రం

శ్లో॥ శ్రియఃకాన్తాయ కళ్యాణ । నిధయే నిధయేఽర్థినాం ।
శ్రీ వేంకట నివాసాయ । శ్రీనివాసాయ మంగళం ॥

## శ్రీ భూదేవి స్తోత్రం

శ్లో॥ విష్ణుశక్తి సముత్పన్నే । శంఖవర్ణ మహీతలే ।
అనేక రత్న సంభూతే । భూమిదేవి నమోస్తుతే ॥

## శ్రీ గురు ప్రార్థన

శ్లో॥ నిత్యానందైక కందాయ । నిర్మలాయచిదాత్మనే ।
జ్ఞానోత్తమాయ గురవే । సాక్షిణే బ్రహ్మణేనమః ॥

## పరమ భాగవతోత్తములు

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక ।
భీష్మ దాల్భ్యాన్, రుక్మాంగదార్జున
వశిష్ఠ విభీషణాదీన్ పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి ॥

## వ్యాసప్రార్థన

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మా । ద్విబాహురపరోహరిః ।
అఫాలలోచన శ్శంభు । ర్భగవాన్ బాదరాయణః ॥

## నవగ్రహ ప్రార్థన

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ । మంగళాయ బుధాయచ ।
గురు శుక్ర శనిభ్యశ్చ । రాహవే కేతవేనమః ॥

గోమాత ప్రార్థన

శ్లో॥ గావో మేమాతరస్సర్వా । గావోమే పితరస్తథా ।
గావో మమాగ్రతస్సంతు । గావోమే సంతుస్పృష్టతః ।
గావోమే పార్శ్వతస్సంతు । గవాంబ్యందేవసామ్యహం ॥

బిల్వవృక్ష ప్రార్థన (మారేడు)

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం । త్రినేత్రంచ త్రియాయుషం ।
త్రిజన్మ పాపసంహారం । ఏకబిల్వం శివార్పణం ॥

అశ్వత్థ ప్రార్థన (రావిచెట్టు)

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ । మధ్యతో విష్ణురూపిణే ।
అగ్రత శ్శివరూపాయ । వృక్షరాజాయతేనమః ॥

సంధ్యా దీప ప్రార్థన

శ్లో॥ శుభం భవతు కల్యాణీ । ఆరోగ్యం ధనసంపదం ।
మమశత్రు వినాశాయ । సాయం జ్యోతిర్నమోస్తుతే ॥

వాల్మీకి ప్రార్థన

శ్లో॥ కూజన్తం రామ రామేతి । మధురం మధురాక్షరం ।
ఆరుహ్య కవితా శాఖాం । వన్దే వాల్మీకి కోకిలం ॥

ఔషధ సేవ

శ్లో॥ ధన్వంతరిం గరుత్మంతం । ఫణిరాజంచ కౌస్తుభం ।
అచ్యుతం చామృతం చంద్రం । స్మరేదౌషధకర్మణే ॥

చంద్ర దర్శనం (వెలపొడుపు)

శ్లో॥ క్షీరసాగర సంపన్న । లక్ష్మిప్రియ సహోదర ।
హిరణ్య మకుటావ్ భాస్వత్ । బాలచంద్ర నమోస్తుతే ॥

పరాశర ప్రార్థన

శ్లో॥ ధర్మజ్ఞం ధార్మికం ధీరం । ధర్మాత్మానం ధయావిధిం ।
ధర్మశాస్త్ర ప్రవక్తారం । పరాశరమునింభజే ॥

తులసీ ప్రార్థన

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని । యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వవేదాశ్చ । తులసీంత్వాం నమామ్యహమ్ ॥

సూర్యస్తవం

శ్లో॥ ఉదయే బ్రహ్మరూపశ్చ । మధ్యాహ్నేతు మహేశ్వరః ।
అస్తకాలే స్వయం విష్ణుః । త్రిమూర్తిశ్చ దివాకరః ॥

ప్రదక్షిణ నమస్కారం

శ్లో॥ అన్యథా శరణం నాస్తి । త్వమేవ శరణం మమ ।
తస్మాత్ కారుణ్య భావేన । రక్షరక్ష జనార్ధన ॥
రక్షరక్ష పరమేశ్వర
రక్షరక్ష గణాధిప
రక్షరక్ష మహేశ్వరి

నిద్రలేచునపుడు (భూ ప్రార్థన)

శ్లో॥ సముద్ర వసనే దేవీ । పర్వతస్తన మండితే ।
విష్ణుపత్ని నమస్తుభ్యం । పాదస్పర్శం క్షమస్వమే ॥

కర దర్శనం

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః । కరమధ్యే సరస్వతీ ।
కరమూలే స్థితా గౌరీ । ప్రభాతే కరదర్శనం ॥

భుజించునపుడు

శ్లో॥ అన్నం బ్రహ్మరసో విష్ణుర్భోక్తా దేవో మహేశ్వరః ।
ఏవం సంచిత్య భుంజానో దృష్టిదోషైర్నలిప్యతే ॥

భుజించిన పిదప

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణంచ । శమ్యంచ బడబానలం ।
ఆహార పరిణామార్థం । స్మరామిచ వృకోదరం ॥

శ్రీ విఖనసాచార్య స్తోత్రం

శ్లో॥ శ్రౌతస్మార్తాదికం కర్మ । నిఖిలం యేన సూత్రితం ।
తస్మై సమస్త వేదార్థవిదే । విఖనసే నమః ॥

* * *

శ్లో॥ శ్రీ కళ్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం
గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదాన తుల్యంనృణాం ।
ఆయుర్వృద్ధిదముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం
నా నా కర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం ॥

| | | | |
|---|---|---|---|
| కలియుగాబ్దములు | 5099 | శ్రీ శంకరాచార్యాబ్దములు | 2070 |
| విక్రమార్క శకాబ్దములు | 2055 | శాలివాహన శకాబ్దములు | 1920 |
| హిజరీ శకాబ్దములు | 1418-19 | శ్రీరామానుజాబ్దములు | 981 |
| శ్రీమధ్వాచార్యాబ్దములు | 881 | భారత స్వతంత్రాబ్దములు | 51 |
| ఆంధ్రరాష్ట్రావతారాబ్దములు | 42 | ఇంగ్లీషు | 1998-99 |

## నవనాయక నిర్ణయము

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజా | -- | రవిః | అర్ఘాధిపతిః | -- | చంద్రః |
| మంత్రీ | -- | కుజః | మేఘాధిపతిః | -- | చంద్రః |
| సైన్యాధిపతిః | -- | చంద్రః | రసాధిపతిః | -- | సూర్యః |
| సస్యాధిపతిః | -- | కుజః | నీరసాధిపతిః | -- | గురుః |
| ధాన్యాధిపతిః | -- | బుధః | | | |

శుభులు 5 + పాపులు 4 = 9 మొత్తం.

## ఉపనాయక నిర్ణయము

| | | | | | |
|---|---|---|---|---|---|
| పురోహితః | -- | శుక్రః | నరాధిపతిః | -- | చంద్రః |
| పరీక్షకః | -- | గురుః | గ్రామాధీశః | -- | గురుః |
| గణకః | -- | శనిః | వస్త్రాధీశః | -- | రవిః |
| గ్రామనాయకః | -- | చంద్రః | రత్నాధీశః | -- | శుక్రః |
| దైవజ్ఞః | -- | చంద్రః | వృక్షాధిపతిః | -- | బుధః |
| రాష్ట్రాధిపతిః | -- | రవిః | జంగమాధిపతిః | -- | గురుః |
| సర్వదేశోద్యోగాధిపతిః | -- | కుజః | సర్పాధిపతిః | -- | శనిః |
| అశ్వాధిపతిః | -- | కుజః | మృగాధిపతిః | -- | చంద్రః |
| గజాధిపతిః | -- | బుధః | శుభాధిపతిః | -- | రవిః |
| దేశాధిపతిః | -- | శుక్రః | స్త్రీణామధిపతిః | -- | చంద్రః |
| పశూనామాధిపతిః | -- | చంద్రః | | | |

శుభులు 14 + పాపులు 7 = మొత్తం 21.

* * *

# శ్రీ బహుధాన్యనామ సంవత్సర పీఠికారంభః

## సంవత్సర ఫలితము

ఈ సంపత్సరము రాజు రవి. మంత్రి, సేన, అర్ఘ, మేఘాధిపతి చంద్రుడు. సస్యాధిపతి కుజుడు. ధాన్యాధిపతి బుధుడు. రసాధిపతి రవి. నీరసాధిపతి గురుడు. పగటి యందార్ద్రా ప్రవేశము సస్యక్షయము. పశునాయకుడు యముడు. గోష్ఠాద్బహిష్కర్త శ్రీ కృష్ణుడు, గోష్ఠాగార ప్రాపకుడు బలరాముడు. పశువృద్ధి సుభిక్షము. పాడిపంటలు అభివృద్ధికరముగ వుండును. 2 కుంచముల వర్షము. అందు 2 భాగములు భూమియందును. 9 భాగములు పర్వతములందును. 9 భాగములు సముద్రములందును వర్షము కల్గును. తూర్పు-ఉత్తర ప్రాంతములందు అధిక వర్షములు. తూర్పు-ఈశాన్య ప్రాంతములందు జనారిష్టములు. 16 వీసములలో 9 వీసములుపండును. అందు వర్షయోగముచే స్వల్పముగ చేతికందును. మొదటి పంట కంటె రెండవపంట విస్తారము. మాగాణీ ఎరుపు సస్యములు బాగుగా పండును. ఫలపుష్పములభివృద్ధి చెందును. జ్యేష్ఠ పూర్ణిమా ప్రాంతమున తొలకరించును.

అస్మిన్దేశే లోకవ్యవహారతః చాంద్ర సౌర మానవశాదయం 'బహుధాన్య' నామ సంవత్సరః బార్హస్పత్యమానేన కాశీ ప్రాంతే 'ఖర' నామ సంవత్సరః గుర్వస్తమయం, గురూదయం. అస్మిన్వత్సరేనాస్తి. అత్ర ప్రభవాది క్షయాంతేషు (షష్ఠి) పంచవత్సరాత్మకాని ద్వాదశయుగాని భవంతి. తదుక్తం శ్రీ పతినా యుగం భవేద్వత్సర పంచకేన యుగానితు ద్వాదశ వర్ష షష్ఠ్యాం. ఇత్యేతేషాం యుగానాం మధ్యే ఇంద్ర దేవతాకం తృతీయ యుగం. వర్తమానం పంచవత్సరాత్మక తృతీయయుగే సంవత్సర పరివత్సరేదావత్సరేదువత్సరే ద్వత్సరాణాం పంచానాం మధ్యే సూర్యదేవతాక పరివత్సరనామకః శ్రీ బహుధాన్య నామ సం॥రః అస్మిన్ పరివత్సర వామక బహుధాన్య వత్సరే యవదానం విశేషః. తదుక్తం విష్ణుధర్మోత్తరే పరిపూర్వేచ యద్దానం యవానాం బహుపుణ్యమితి. పగటి యందార్ద్రాప్రవేశము, సస్య క్షయము (జలపూర్వకముగ). తెల్లవారు ఝామున రవి మేషరాశి యందు ప్రవేశము సస్యక్షయము. రాజయుద్ధం రోగపీడలు. పశుక్షేమం. గతంకంటెమేలు. అతివృష్టి. అనావృష్టి. స్వల్పఖండాంతక వర్షములు. అధిక వాయువు. జలసంబంధ ప్రమాదములు విశేషము.

| | | | |
|---|---|---|---|
| బుశ | ల ర కు | | |
| శు కేగు | జగల్లగ్నము | | |
| | | | రా |
| | | చం | |

| | | | |
|---|---|---|---|
| బురశ కుచం | | ల | |
| కే గు | వర్షలగ్నము | | |
| శు | | | రా |
| | | | |

జగల్లగ్నమును పరిశీలించగ లగ్నమువందు లగ్న అష్టమాధిపతి కుజుని స్వక్షేత్రస్థితి. పంచమాధిపతికి ఉచ్ఛ స్థితి. రాజ్యలాభాధిపతి శనికి వ్యయస్థితి. వ్యాపార కారకునికి నీచ. 11వ స్థానమున భాగ్యవ్యయాధిపతి గురువితో శుక్రుడు, చండాల కేతువు, ఆత్మస్థానమున చండాలుడు, చంద్రుని సప్తమ కేంద్రస్థితి. వీనివలన దేశమున కొంత విశేషయోగములు కల్గుచున్ననూ అధికారులువియంతృత్వదోరణి, స్వార్థపూరితమయిన శక్తియుక్తులు కల్గి తద్వారాచెడుయందు దృష్టిని

ప్రదర్శింతురు. చంద్ర బలముచే పురుషుల కంటె స్త్రీలు అన్నిరంగముల సాంఘిక వాతావరణములు, క్రియాత్మక నిర్మాణములు కల్గింతురు. ఇందు లగ్నమునకు 'పంచానన' స్థితి రాజయోగము ద్వారా ప్రజలందు ఆధ్యాత్మిక దైవ కార్యములు, అన్న శాంతులు చేయుచుందురు.

వర్షలగ్నమున లాభస్థానమునందు పంచగ్రహకూటమి. అందు లగ్నాధిపతికి భాగ్యస్థితి, లాభస్థానమునందు పాప గ్రహయుక్త చంద్రుడు. అష్టమలాభాధిపతికి రాజ్యస్థానమున చండాలత్వము. సౌఖ్యస్థానమున రాహువుకల్గినవి. చతురానన, పంచగ్రహకూట యోగములు కల్గినవి.

పరిశీలించగ అధికారవర్గము వార్కి పరస్పర అవగాహనా లోపములు, భారీప్రాజెక్టులకై అధిక ధనవ్యయము. కీర్తిని కల్గించు అధికారులకు శతృత్వ బాధలు, మంత్రివర్గమార్పులు సూచించును. న్యాయవవస్థ మార్పులు సూచించును.

భారత చక్రమున శుక్ర మహాదశ వున్నందున ఉన్నతాధికారులు, ముఖ్యులు ఎంతటిబృహత్ప్రణాళికలు అయిననూ నిర్వహింతురు. శుక్ర కేతు గ్రహములచే నూతన యాంత్రిక వ్యాపారములు వృద్ధి చేయుట. వ్యవస్థాపక కార్యములు చేబట్టెదరు. గూఢచర్యమువారు లొంగిపరిపాలింతురు.

చైత్రమున ధరలు అధికము. జూలై, ఆగష్టులందు గ్రహములు కాలసర్ప యోగముచే అధిక ధన, జన వ్యయములు, సస్యములు మూషిక కీటక బాధలు. సెప్టెంబరు, అక్టోబరులందు ఖండప్రాంతమందు అతివృష్టి వర్షములు, ధరలకు విలబాటు, ధాన్యము ధర అధికము కల్గును. అక్టోబరు, నవంబరులందు వరదలు, సంపూర్ణ జల ప్రవాహములు, మిశ్రమ వాతావరణములు. ప్రజాఉద్యమములు. నటులకు, గాయకులకు హాని కల్గును.

శని మేషరాశిలో నీచ స్థాన సంచారమువలన ప్రజలందు ఆస్థిమితములు. యాంత్రిక వ్యాపార సంస్థా దుర్ఘటనలు, వాహన ప్రమాదములు, అవినీతి కుంభకోణములు, కులమత వైషమ్యములు అధికమగు చుండును.

ఈ సంవత్సరమున గురు మౌఢ్యమి, గురూదయములు లేవు. గురుని రాశి త్రయ సంచారముచే కాలమానము అనుకూల్యతవుండదు. అన్ని రకముల అరాచకములు సూచించును. 99 సంవత్సరం జనవరిలో గురుని స్వక్షేత్ర ప్రవేశమువలవ దేశమునకు సుభిక్షత, క్షేమము కల్గును. నూతన శతాబ్దసంవత్సరం సమీపించుటచే అన్నిరంగముల, అన్నిరకముల అరాచక, ధన, జన వ్యయములు. పరస్పర ప్రజాయుద్ధములు. ప్రాకృతిక వాతావరణభీభత్సములు, చంచల స్థితి చోర మోసములు కల్గుచుండును.

రాబోవు శ్రీ ప్రమాధి సంవత్సరమున (1999) జ్యేష్టమధిక మాసమగును. చైత్రమాసమున గురుమూఢమి కల్గును. శ్రీ తిరుమలేశునికి రెండు బ్రహ్మోత్సవములు కల్గును.

ఈ లోకరక్షకుడు సూర్యభగవానుడు, యుగచక్రవర్తి శ్రీకృష్ణపరమాత్మ, కలియుగ దైవము, శ్రీ లక్ష్మీవేంకటరమణుడు లోకమునకు శాంతి, రక్షణ, సన్మార్గములు కల్గించుదురు గాక.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## చాంద్రమానాబ్ద నిర్ణయము

శ్లో॥ బహుధాన్యాబ్దె బహుభిర్ధాన్యైః పూర్ణాఖిలాధరా ।
గావః ప్రభూత పయసో రాజానస్యు ర్వి వైరిణః ॥

చాంద్రమానమున ఈ సంవత్సరము 'శ్రీ బహుధాన్య' సం॥రము అగుట వలన భూమి బహుపంటలతో నిండి వుండును. పశువులు సుభిక్షము నొందును. రాజులు పరస్పర యుద్ధములు చేయుదురు. ముఖ్యులకు మార్పు కల్గును. అగ్ని బాధలుండును. ప్రజలునానావిధ రోగ పీడితులగుచుందురు.

## బార్హస్పత్య మానాబ్ద నిర్ణయము

శ్లో॥ ఖరాబ్దేనిఖిలా భూపాశ్చాన్యోన్య సమరోత్సుకాః ।
మధ్యమావృష్టి రత్యుగ్రరోగై ర్భూపాలయం యయుః ॥

బార్హస్పత్య మానమురీత్యా 'ఖర' నామ సంవత్సరము అగుటచే అధికారులుకు, ఉద్యోగులకు పరస్పర వైషమ్యములు ఏర్పడుచుండును. మధ్యమవర్షములు, స్వల్పవృష్టి, స్వల్ప పంటలు, అచ్చటచ్చట ఖండవృష్టి భయోత్పాతములు అధికము.

## గురుదయాబ్ధ నిర్ణయము

ఈ సంవత్సరము గురునికి ఉదయ అస్తమయములులేనందున గత అబ్ద ప్రకారం సామాన్య ఫలితములు ఇందుకల్గును.

## కర్తరీ నిర్ణయము

ది. 4-5-98 వైశాఖ శుద్ధ అష్టమీ సోమవారము రాత్రి డొల్లు కర్తరీ ప్రవేశము.

11-5-98 వైశాఖ పూర్ణిమా సోమవారము కృత్తిక కార్తె, నిజకర్తరీ

28-5-98 జ్యేష్ఠశుద్ధ తదియా గురువారము కర్తరీ త్యాగమగును.

## మౌఢ్య నిర్ణయము

శుక్ర మౌఢ్యము: ది. 25-9-98 ఆశ్వయుజ శుద్దపంచమీ శుక్రవారం తె.గం. 5-31 ని॥లకు ప్రాగస్తమిత శుక్రమౌఢ్యము ప్రారంభమయి 5-12-98 మార్గశిర బహుళ విదియా శనివారం పశ్చాదుదిత శుక్ర మౌఢ్యమి త్యాగమగును.

గురుమౌఢ్యము: రాబోవు ప్రమాధి సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి 18-3-99 నుండి బహుళ చతుర్దశీ 15-4-99 వరకూ గురుమౌఢ్యమి కలదు.

## పుష్కర నిర్ణయము

12-1-1999 తేదీ పుష్య బహుళ దశమీ మంగళవారము రా.గం. 10-18 ని॥లకు శ్రీ ప్రణీతానదికి పుష్కర ప్రవేశమగును.

## విజయదశమీ నిర్ణయము

ఆశ్వయుజ శుద్ధ నవమీ బుధవారం ఉ.గం. 10-4 ని॥లు. ఉత్తరాషాఢ రా.గం. 3-37ని॥లు. దశమీ గురువారం ఉదయం 9-46, శ్రవణం రా.గం. 3-40 అనిగలదు.

శ్లో॥ ఉదయే దశమీ కించిత్సంపూర్ణైకాదశీయది
శ్రవణర్క్షయదా కాలే సాతిథి ర్విజయాభిదా ।
పూర్వాహ్ణేవా పరాహ్ణేవా శ్రవణేన సమన్వితా
ఆశ్వయుగ్దశమీ శుక్లా విజయేతి ప్రకీర్తితా ॥

శ్లో॥ యదాతు పూర్వదిన ఏవ అపరాహ్ణవ్యాపినీ దశమీ ।
పరదినే స్వల్పాపి శ్రవణ యోగవతీ తదా పరైవ.

నిర్ణయ సింధు, కాలమాధవీయము. ధర్మసింధు నిబంధన గ్రంథములు చూపబడినవి. విజయదశమీ, శమీపూజా, అపరాజితాదేవిపూజ, అపరాహ్ణముగల దశమి రోజు చేయవలెను. ఈ సంవత్సరము దశమి బుధవారం వున్నను గురువారం ఉదయం గం. 9-46 వరకు వున్ననూ శ్రవణ నక్షత్ర యోగముచే 1-10-98 గురువారము విజయదశమి ఆచరింపవలెను.

## సూర్యగ్రహణము 22-8-98

శ్రీ బహుధాన్య నామ సంవత్సర శ్రావణ బహుళ అమావాస్యా శనివారం ఉదయం రాహుగ్రస్తః ముచ్యమానోదయ సూర్యగ్రహణము కల్గును. కృష్ణ వర్ణము, సవ్యగ్రహణము, దక్షిణ గోలము, పశ్చిమ నైఋతి దిశ స్పర్శ, ఆగ్నేయదిశి మోక్షము.

22-8-98 శనివారం శ్రీ వేంకటాద్రి తిరుపతి (మద్రాసు) ప్రాంతములకు సూర్యోదయాది ఉ.గం. 6-04 ని॥లు నుండి 6-43 ని॥లువరకు మొత్తము గం. 0-39 నిమిషములు మాత్రము కన్పించును.

విజయవాడ ప్రాంతమునకు గం. 5-53 ని॥లకు సూర్యోదయము నుండి 6-40 ని॥లు వరకు కన్పించును. మొత్తం గం. 0-47 ని॥లు మాత్రమే.

విశాఖపట్నం ప్రాంతమునకు గం. 5-41 ని॥లకు సూర్యోదయము నుండి 6-40 ని॥లు వరకు కన్పించును. మొత్తం గం. 0-59 ని॥లు మాత్రమే.

హైదరాబాదు ప్రాంతమునకు గం. 6-01 ని॥లకు సూర్యోదయము నుండి 6-37 ని॥లు వరకు కన్పించును. మొత్తం గం. 0-36 ని॥లు మాత్రమే.

ఈ గ్రహణము మఘానక్షత్రము సింహరాశి యందు కల్గుచున్నందున మఘా నక్షత్రము సింహరాశివారు దీనిని చూడరాదు. గ్రహణానంతరము యథాప్రకారము శాంతి జరిపించుకోవలెను. ఈ గ్రహణము సూర్యోదయ కాలమునందు అగుటవలన గ్రహణానంతరము నిత్యభోజన ప్రత్యాబ్దికాదులు ఆచరింపవలెను.

## మనకు కనిపించని గ్రహణములు

ది. 6-9-98 ఆదివారం చంద్రగ్రహణము మరియు ది. 16-2-99 మంగళవారం సూర్యగ్రహణము మనదేశమునకు కనుపించవు.

## రాజాది నవనాయక ఫలములు

### రాజా రవిః

శ్లో॥ అన్యోన్యవైరం క్షితిపాలకానాం నాత్యంబు ముంచంతి బలాహకాశ్చ ।
భూపాద్భయం శస్త్రభయం నరాణాం చోరాగ్నిబాధాబ్దపతౌదినేశే ॥

రాజు రవి అయినందున అల్పవృష్టి. ప్రజలకు అధికారుల వలన శస్త్రము వలన, భయము, చోరాగ్ని బాధలు కల్గుచుండును. రాజులు పరస్పరం కలహింతురు. రాజకీయ కల్లోలమధికము.

### మంత్రీ కుజః

శ్లో॥ పురగ్రామవనాదీని దహ్యంతే వహ్నినాభృశమ్ ।
మంద వృష్టిర్భవే ద్యుద్ధం మంత్రీస్యా ద్భూమినందనః ॥

ఇందు అగ్ని భయము. స్వల్పవృష్టి, వేడిగాలులు అధికము. అధికార ధన దుర్వ్యయములు అధికము.

### సైన్యాధిపతిః చంద్రః

శ్లో॥ అతివర్షమతీవార్ఘ మరోగా స్సుఖినోజనాః ।
బహుక్షీణప్రభాగావశ్చంద్రే సేనాధిపేయది ॥

ఇందు ఆహార ధాన్యములకు ధరలు అధికముగ హెచ్చుతగ్గులుండును. నిలకడ లేదు. సంవత్సర మధ్యమందు ధాన్యమునకు అధిక ధర. వైద్యప్రచారములధికమగును.

### సస్యాధిపతిః కుజః

శ్లో॥ సువృష్టి స్సర్వదేశేషు సమృద్ధాశ్చణకాదయః ।
రక్త భూమిస్తు ఫలితా పూర్వసస్యాధిపే కుజే ॥

కుజునకు పూర్వసస్యాధి పత్యము కల్గుటచేత ఎరుపునేల, సస్యములకు వృద్ధి. జనులకు జ్వరపీడలు, అధికారులలో తీవ్ర భేదములు. కందులు, మిర్చి, వేరుశనగ, ఎరుపు ధాన్యములు మొదలగు వానికి, మాగాణీ పంటలు మధ్యమ ఫలితము. వాతావరణ అనుకూల్యత.

### ధాన్యాధిపతిః బుధః

శ్లో॥ మధ్య వృష్టిర్మధ్య సస్యం మేఘావాతేన పీడితా ।
త్రాసస్సర్వ న్నృపాణాంచ బుధే ధాన్యాధిపేసతి ॥

బుధునికి ధాన్యాధి పత్యము కల్గుటచే వాయుపీడిత మేఘములు, మధ్యమ వృష్టి, తుఫానుగాలి వీచుట, ప్రజలకు భయభ్రాంతత్వములు కల్గుచుండును.

### అర్ఘాధిపతిశ్చంద్రః

శ్లో॥ సువృష్టి స్సర్వ సస్యానామభివృద్ధిశ్చ జాయతే ।
మహతీచార్ఘ వృద్ధిస్స్యా చ్చంద్రే చార్ఘాధిపేసతి ॥

అర్ఘాధిపుడుచంద్రుడైనందున ధరలధికము, సస్యాభివృద్ధికల్గును. వస్త్రములు, ముత్యములు, పంచదార, జొన్నలు, కిరోసిన్, పాలు, బియ్యం మున్నగువానికి ధరలధికమగును.

### మేఘాధిపతిశ్చంద్రః

శ్లో॥ సువృష్టి స్సర్వదేశానాం ఫలితా ధాన్య జాతయః ।
బహుక్షీర ప్రదాగావః చంద్రే మేఘాధిపే సతి ॥

చంద్రుడు మేఘాధిపతి అయినందున అన్ని ప్రాంతములందు సువృష్టి. ధాన్య జాతులన్నియు సమముగా ఫలించుట, పశువులు క్షేమం, సుభిక్షత నొందును. మేఘాడంబరత అధికము. తరచు ఖండప్రాంతములందు ఖండఖండములుగ అధికవర్షములు కురియును.

### రసాధిపతిస్సూర్యః

శ్లో॥ తిలతైల గుడక్షారాద్యనేక రసజాతయః ।
శూన్యార్ఘం యాంతితే సర్వే రవౌయదిరసాధిపే ॥

రవిరసాధిపతి అయినందున బెల్లము, ఉప్పు, తిలలు మొదలగు రస ద్రవ్యములకు ధరలు నిలబాటు. మిర్చి, వెల్లుల్లి అధిక ధరలు, చింతపండు, పసుపు, కొబ్బరి, మామిడి, తైలాదులకు, కలప, సుగంధ ద్రవ్యములకు ధర నిలబాటు.

### నీరసాధిపతిర్గురుః

శ్లో॥ పూగీ ఫలాన్యఖిలరత్న సువర్ణ ధాన్యకార్పాస చర్మ కుసుమానిచ చందనం చ ।
వృద్ధిం యయుర్ద్విజగణాస్సుఖినో భవంతి భూమౌచనీరసపతౌ సురరాజపూజ్యే ॥

నీరసాధిపతి గురువయినందున వక్కలు, మణులు, రత్నములు, బంగారము, వెండి, ప్రత్తి, చర్మము, పుష్పములు సమృద్ధినొందును. సుగంధ ద్రవ్యములు, చందనము మొదలగువానికి పై వస్తువులకు స్వల్పముగ సూచనకు తగన గిరాకీ కల్గును.

### మేఘనిర్ణయం

నవమేఘ పక్షమున 'నీల' నామక మేఘము మేరుపర్వతమునకు ఆగ్నేయ భాగమున ఉద్భవించును. అల్పవృష్టి, అనర్థము. చతుర్మేఘ పక్షమున పుష్కర నామక మేఘము - అల్పవృష్టి. రెండు కుంచముల వాయువు.

### భూవాహక శేష నిర్ణయం

తక్షక నాఘ శేషుడు భూమిని వహించును. సుజనులకు దారిద్ర్యము నీచులకు సుఖము కల్గును.

## పశుపాలక నిర్ణయం

పశుపాలకుడు - యముడు: పశుపాలకుడు యముడు అగుటచే ధరలు అధికము. అల్పవృష్టి, పశునష్టము, పాడిపంటలు తగ్గును.

గోష్టాగార ప్రాపకుడు - బలరాముడు: ఇందువల్ల సువృష్టి, క్షేమారోగ్యములు కలిగి ప్రజలు సుఖింతురు.

గోష్టార్బహిష్కర్త - శ్రీ కృష్ణుడు: ఇందువల్ల పశువృద్ధి, సుభిక్షము, పాడి పంటల వృద్ధి కల్గును.

## ప్రత్యబ్ద యోగ పంచక ఫలములు

1. జ్యేష్ఠశుద్ధ ప్రతి పద్యుక్త (మంగళ) వారఫలము: జ్యేష్ఠ శు. పాడ్యమి మంగళవారము అయినందున దుర్భిక్షము, యుద్ధ రోగ భయములు కల్గును. రాజులకు పరస్పరవైరము, పట్టణ, గ్రామ, వన, పర్వత ప్రాంతములు అగ్ని దగ్ధములు అగును.

2. ఆషాఢ శుద్ధ పంచమీ యుక్త (సోమ)వారఫలము: ఆషాఢ శుద్ధ పంచమీ సోమవారం అయినందున మంచి వర్షములు కల్గును. ప్రజలు సుభిక్షము, క్షేమారోగ్యములు కల్గియుందురు.

3. ఆషాఢ శుద్ధ నవమీ చిత్ర: చిత్రా నక్షత్రముతో కూడియుండుటచే సర్వసస్య సమృద్ధి కలిగియుందురు.

ఆషాఢ శుద్ధ దశమి స్వాతి నక్షత్రముతో కూడియుండుటచే గొప్ప వర్షములు కురియును.

## ఆషాఢ బహుళ తిథి నక్షత్రయుక్త ఫలం

ఆషాఢ బ. ద్వాదశి రోహిణి నక్షత్రముతో కూడి యుండుటచే సర్వసస్య వృద్ధి సామాన్యముగా వుండును.

## పుష్య బహుళ అమావాస్యయుక్త (ఆది) వారఫలం

పుష్య బ. అమావాస్య ఆదివారమగుటచే వ్యాధి కల్గును. అధికారులకు శతృత్వములుండును. ఎరుపుజాతి వస్తువులకు అధిక ధరలు కల్గును.

## మేష సంక్రాంతి ఫలం

మేష సంక్రమణము తెల్లవారు ఝామున సంభవించుటచే సుభిక్షము. మంగళవారము అధికమగుట వలన ధరలధికము.

## రవేః ఆర్ద్రా ప్రవేశకాల ఫలమ్

22-6-98 సోమవారం ఆర్ద్రా 1ర్కః 13.7 త్రయోదశి (14శి) కృత్తిక వెళ్ళగా రోహిణి, ధృతియోగము, వణిక్కరణము. మ.గం. 2-45ని దివార్ద్రా సస్యనాశాయ పగటియందు ఆర్ద్రాప్రవేశము - సస్యనాశం, చతుర్దశి - వృష్టినాశం, సోమవారం - సుభిక్షం, రోహిణియందు శుభము. ధృతియోగమున సుభిక్షము వణిక్కరణము ధనధాన్యములకు వెలలు అధికము. తులయందు వృష్టి.

భరణ్యాది చంద్రమండల ఫలమ్

ఆర్ద్రా నక్షత్రమున సూర్యుడు ప్రవేశించు సమయమున చంద్రుడు భరణ్యాది చంద్రమండలమునందు ఉండుటచే సస్యానుకూల వృష్టి.

## మకర సంక్రమణ పురుష లక్షణము

ది. 14-1-1999 తేదీ శ్రీబహుధాన్యనామ సంవత్సర పుష్య బహుళ తత్కాల త్రయోదశీ గురువారం రా.గం. 9-12 ని॥లకు జ్యేష్ఠా నక్షత్రము, వృద్ధియోగము, గరజికరణము, సింహలగ్నమునందు రవి మకర రాశియందు ప్రవేశించి సంచరించును.



మంద నామధేయము - విప్రులకు శుభము, వేపాకు నీటితో స్నానం - రోగ భయము; యవాక్షతా ధారణము - గోధుమ పంటకు క్షయము, నీలవస్త్రధారణము - భయంకరము; గోరోచన గంధ లేపనము - శుభంకరము, బిల్వపుష్ప ధారణం - యుద్ధభయము, గోమేధికాభరణ ధారణం - మహాభయము, సీసపుపాత్రయందు భోజనం - యుద్ధ దాయకము, క్షీరాహారము - కీర్తివ్యయము, రేగిపండు తినుట - చోరులకు భయము, కోదండ ఆయుధము - అధికారులకు వ్యయము, కాంచన ఛత్రము - రోగనాశనకరము, గజవాహన ప్రయాణము - అధికారులకు పీడ, విస్మయ ముఖము - అశుభము, కూర్చుని వుండుట - తత్ప్రాంతారిష్టము, ఆగ్నేయదిశ ప్రయాణము - ఆగ్నేయ దిశారిష్టము, మొదలగు లక్షణములు కల్గి మకర సంక్రమణ పురుషుడు వుండును.

ఇందు కృష్ణపక్షమగుటవలన - సుభిక్ష క్షేమారోగ్యములు, త్రయోదశీతిథివలన -జలప్రళయము, గురువారమగుటవలన - అత్యంత సుఖమును, సింహలగ్నమగుటవలన - పురుషచింత, 19వ ముహూర్తమగుట వలన శుభము మొదలగు ఫలితములుండును.

ఫలశ్రుతి

సంక్రాంతి పురుషోత్పత్తి కాలేదాన స్వశక్తితః<br>
ఫలం కాంస్యాది దానాని దీయతే దోషనాశనం<br>
ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాంశు కాద్యం సతి లేక్షుగావః<br>
ధాన్యం ఖరాంశోర్మకరప్రవేశ ఏతాని దానాని విశేషితాని<br>
మకరస్తేతీక్ష భావేధాన్యం దానం కరోతియః<br>
తేజసేరూప సామర్థ్యః సార్వభౌమ ప్రజాయతే<br>
యశ్శృణోతి మధు శుక్ల పక్షకే వర్షనాథ సచివాదికం ఫలం<br>
ప్రాప్నుయాద్దురితముక్త విగ్రహశ్చాయురర్థమతులం యశశ్శుభం॥

## కందాయ ఫలములు

| అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్రి | పున | పుష్య | ఆశ్రే | మఘ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 |
| 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 |
| స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ | మూల | పూ-షా | ఉ-షా | శ్రవ | ధని | శత | పూ-భా | ఉ-భా | రేవ | |
| 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | |
| 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | |

ఇందలి బేసి సంఖ్యలు ధనలాభమును, సమసంఖ్యలు సమఫలమును, శూన్య సంఖ్యలు శూన్య ఫలితములను ఇచ్చును. మొదటిసున్న రోగ భయము, మధ్య సున్న మనోభీతిని, చివరిసున్న హానిని తెలుపును. ఒక్కొక్క సంఖ్య 4 మాసములుండును.

## ఆదాయవ్యయములు -- రాజపూజ్యావమానములు

| రాశి | ఆదాయం - వ్యయం | రాశి | రాజపూజ్యం-అవమానం |
|---|---|---|---|
| మేషం | 2 - 14 | మేషం | 5 - 7 |
| వృషభం | 11 - 5 | వృషభం | 1 - 3 |
| మిధునం | 14 - 2 | మిధునం | 4 - 3 |
| కర్కాటకం | 8 - 2 | కర్కాటకం | 7 - 3 |
| సింహం | 11 - 11 | సింహం | 3 - 6 |
| కన్య | 14 - 2 | కన్య | 6 - 6 |
| తుల | 11 - 5 | తుల | 2 - 2 |
| వృశ్చికం | 2 - 14 | వృశ్చికం | 5 - 2 |
| ధనుస్సు | 5 - 5 | ధనుస్సు | 1 - 5 |
| మకరం | 8 - 14 | మకరం | 4 - 5 |
| కుంభం | 8 - 14 | కుంభం | 7 - 5 |
| మీనం | 5 - 5 | మీనం | 3 - 1 |

సర్వాదాయము +99 - సర్వవ్యయము 93 = మిగులు +6.

# శ్రీ బహుధాన్య నామ సంవత్సరములో గ్రహసంచారములు

## రవిచారః

చైత్ర బహుళ ౨ సోమ మేషే రవిః; వైశాఖ బహుళ ౩ గురు వృషభే; జ్యేష్ఠ బహుళ ౬ సోమ మిథునే; ఆషాఢ బహుళ ౮ శుక్ర కర్కాటకే; శ్రావణ బ.౧౦ సోమ సింహే; భాద్రపద బ.౧౨ గురు కన్యాయాం; ఆశ్వయుజ బ.౧౨ శని తులాయాం; కార్తీక బ.౧౩ సోమ వృశ్చికే; మార్గశిర బ.౧౩ బుధ ధనుషీ; పుష్య బ. ౧౨ గురు మకరే; మాఘ బ.౧౨ శని కుంభే; ఫాల్గుణ బ.౧౨ ఆది మీనరాశౌ రవి ప్రవేశః.

## కుజచారః

చైత్ర శు.౮ శని మేషే కుజః; వైశాఖ బ.౪ శుక్ర వృషభే; ఆషాఢ శు.౩ శని మిధునే; శ్రావణ బ.౪ మంగళ కర్కాటకే; భాద్రపద శు.౬ ఆది సింహరాశౌ; కార్తీక బ.౧౩ సోమ కన్యాయాం; పుష్య బ.౧౦ మంగళ తులాయాం కుజప్రవేశః.

## బుధచారః

చైత్ర శుద్ధ ౧౪ ఆది మేషే బుధః; జ్యేష్ఠ శు.౪ శుక్ర వృషభే; జ్యేష్ఠ బ.౨ శుక్ర మిధునే బుధః; ఆషాఢ శు. ౩ శని కర్కాటకే; ఆషాఢ బ.౧౨ సోమ సింహే; శ్రావణ బ.౩ సోమ కర్కాటకే వక్రీ; భాద్రపద శు. ౧౨ గురు సింహేఋజుః; ఆశ్వయుజ శు.౧ సోమ కన్యాయాం; కార్తీక బ.౩ గురు తులాయాం; కార్తీక శు.౮ బుధ వృశ్చికే; పుష్య శు.౧౫ శని ధనుషీ; మాఘ శు.౫ శుక్ర మకరే; మాఘ బ.౯ మంగళ కుంభే; ఫాల్గుణ శు.౧౧ శుక్ర మీనే బుధ ప్రవేశః.

## గురుచారః

వత్సరాది ప్రభృతి జ్యేష్ఠ శు.౧ మంగళవాసర పర్యంతం కుంభరాశౌ; తదాదౌ భాద్రపద బ.౫ గురువార పర్యంతం మీనరాశౌ; తదాదౌ పుష్య బ.౧౦ మంగళవార పర్యంతం వక్రత్వేన కుంభరాశౌ; తదాది వత్సరాంతం మీనరాశౌ సంచారః.

## శుక్రచారః

చైత్ర శు.౪ మంగళ కుంభే శుక్రః; వైశాఖ శు.౨ మంగళ మీనే; వైశాఖ బ.౪ ఆది మేషే; జ్యేష్ఠ బ.౧౦ శుక్ర వృషభే; ఆషాఢ బ.౫ మంగళ మిధునే; శ్రావణ శు.౧౫ శని కర్కాటక రాశౌ; భాద్రపద శు.౧౦ మంగళ సింహే; ఆశ్వయుజ శు.౫ శుక్ర కన్యాయాం; ఆశ్వయుజ బ.౩౦స్యా మంగళ తులాయాం; కార్తీక బ.౯ గురు వృశ్చికే; మార్గశిర బ.౩ ఆది ధనుషీ; పుష్య శు.౧౨ బుధ మకరే; మాఘ శు.౬ శని కుంభే; మాఘ బ.౩౦స్యా మంగళ మీనే; ఫాల్గుణ బ.౧౧ శని మేషే శుక్రప్రవేశః.

## శనిచారః

చైత్ర శుక్ల పంచమీ శుక్రవాసర పర్యంతం మీనరాశౌ సంచారః. తదాది ఆవత్సరపర్యంతం మేషరాశౌ సంచారః.

## రాహుకేతుచారౌ

**వత్సరాది ప్రభృతి పుష్య బ.౯ సోమవార పర్యంతం సింహరాశౌ రాహుః, కుంభరాశౌ కేతు సంచారః, తదాది వత్సరాంతం కర్కాటకరాశౌ రాహుః, మకరరాశౌ కేతు సంచారః.**

## 1998-99 శ్రీ బహుధాన్య నామ సంవత్సర కార్తెలు, వృష్టి నిర్ణయములు

| నెం. | కార్తెలు | తేదీలు | వారం | ప్రవేశం | నక్షత్రం | గణం | రాశి | ఫలితములు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | భరణి | 27-4-98 | సోమ | రా.10-12 | కృత్తిక | రాక్షస | మేషం | అనావృష్టి, ఉష్ణాధిక్యత |
| 2. | కృత్తిక | 11-5-98 | సోమ | సా.5-11 | విశాఖ | రాక్షస | తుల | సమోష్ణం, ఖండ ప్రాంత దాహకవృష్టి |
| 3. | రోహిణి | 25-5-98 | సోమ | ప.2-33 | కృత్తిక | రాక్షస | వృషభం | గ్రీష్మాధిక్యత, వాయు ప్రాబల్యత |
| 4. | మృగశిర | 8-6-98 | సోమ | ప.2-9 | విశాఖ | రాక్షస | వృశ్చికం | ఖండ ప్రాంత వర్షములు - వాయువు |
| 5. | ఆర్ద్ర | 22-6-98 | సోమ | ప.2-55 | రోహిణి | మనుష్య | వృషభం | అనావృష్టి, తొలకరి ప్రారంభం |
| 6. | పునర్వసు | 6-7-98 | సోమ | సా.4-47 | అనూరాధ | దేవ | వృశ్చికం | సువృష్టి గాలితో కూడిన వర్షములు - తుఫాను |
| 7. | పుష్యమి | 20-7-98 | సోమ | సా.6-19 | మృగశిర | దేవ | వృషభం | అల్పవృష్టి వాయు ప్రాబల్యత |
| 8. | ఆశ్రేష | 3-8-98 | సోమ | సా.7-0 | జ్యేష్ఠ | రాక్షస | వృశ్చికం | మిశ్రమవృష్టి జలాధిక్యత, మేఘాడంబరం |
| 9. | మఘ | 17-8-98 | సోమ | సా.5-57 | మృగశిర | దేవ | మిథునం | సువృష్టి, సస్యోచితం |
| 10. | పుబ్బ | 31-8-98 | సోమ | ప.1-47 | జ్యేష్ఠ | రాక్షస | వృశ్చికం | చిత్రవృష్టి, మిశ్రమ వాతావరణం-తుఫాను |
| 11. | ఉత్తర | 14-9-98 | సోమ | ఉ.7-37 | ఆర్ద్ర | మనుష్య | మిథునం | అతివృష్టి, అనావృష్టి, చలిగాలులు-ఖండవృష్టి |
| 12. | హస్త | 27-9-98 | ఆది | రా.10-39 | జ్యేష్ఠ | రాక్షస | వృశ్చికం | అల్పవర్షం, అనావృష్టి |
| 13. | చిత్త | 11-10-98 | ఆది | ఉ.10-59 | మృగశిర | దేవ | మిథునం | కుంభవృష్టి |
| 14. | స్వాతి | 24-10-98 | శని | రా.8-39 | జ్యేష్ఠ | రాక్షస | వృశ్చికం | అల్పవృష్టి, గాలి |
| 15. | విశాఖ | 6-11-98 | శుక్ర | రా.3-47 | మృగశిర | దేవ | మిథునం | సువృష్టి, సస్యోచితం |

## సంవత్సరఫలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వినీ | పుష్యమి | స్వాతి | అభిజిత్‌ల | వార్కి | అర్థలాభము |
| భరణి | ఆశ్రేష | విశాఖ | శ్రవణం | " | మనస్తాపము |
| కృత్తిక | మఘ | అనూ | ధనిష్ఠ | " | రాజపూజ్యత |
| రోహిణి | పుబ్బ | జ్యేష్ఠ | శత | " | యుద్ధభయము |
| మృగ | ఉత్తర | మూల | పూ.భా. | " | అలంకారప్రాప్తి |
| ఆర్ద్ర | హస్త | పూ.షా. | ఉ.భా. | " | రోగభయము |
| పునర్వసు | చిత్త | ఉ.షా | రేవతి | " | ఆయుర్వృద్ధి |

## వర్ష ధాన్య ప్రమాణములు

వర్షం 17, ధాన్యం 9, శీతం 17, తృణం 9, ఉష్ణం 11, మారుతం 13, ప్రజావృద్ధి 15, నాశ 15, రాజవిద్వరం 01, ఉగ్రం 11, పుణ్యం 01, పాపం 0, వ్యాధి 19, ఉపశమనం 11, ఆచారం 13, అనాచారం 9, జననం 3, మరణం 17, దేశోపప్లవం 3, దేశస్వాస్థ్యం 15, చోరభయం 5, శాంతి 9, అగ్నిభయం 13, శాంతి 19, మృగోపద్రవం 11, శాంతి 7, కీటకవృద్ధి 3, నాశ 13, మూషికవృద్ధి 13, నాశ 11, సర్పవృద్ధి 17, నాశ 15, కామం 5, లోభం 5, మోహం 15, మదం 9, మాత్సర్యం 11, సుఖం 9, దుఃఖం 3, భోగం 11, విడంబం 17, మనోవేదన 3, ద్వేషం 3, ప్రతిష్ఠ 19, అప్రతిష్ఠ 17, ద్యూతం 13, మత్తత 7, పురుషోత్పత్తి 17, స్త్రీ ఉత్పత్తి 9, ధాతువృద్ధి 17, భయం 7, శౌర్యం 13, దుష్టశిక్షణ 19, శిష్టప్రీతి 7, సత్యం 11, అసత్యం 15, విశ్వాసం 19, అవిశ్వాసం 5, దయ 7, నిర్దయ 9, న్యాయం 11, అన్యాయం 13, పక్షివృద్ధి 1, నాశ 5, ధేనువృద్ధి 3, నాశ 4, మహిషవృద్ధి 1, నాశ 4, మృగవృద్ధి 4, నాశ 1, ఛాగవృద్ధి 2, నాశ 2, వైశ్యవృద్ధి 4, నాశ 1, శూద్రవృద్ధి 3, నాశ 5, మ్లేచ్ఛ వృద్ధి 1, నాశ 1, సంకరవృద్ధి 2, నాశ 5, నవరత్న 1, నాశ 4, అశ్వవృద్ధి 1, నాశ 1, గజవృద్ధి 5, నాశ 4, ఉష్ట్రవృద్ధి 2, నాశ 4, విప్రవృద్ధి 3, నాశ 2, క్షత్రియవృద్ధి 3, నాశ 4, మరకత 5, మాణిక్యవృద్ధి 1, వజ్ర, వైఢూర్య, గోమేధిక, పుష్యరాగేంద్ర, నీల, ప్రవాళ, మౌక్తికాది ఇతర రత్న వృద్ధి క్రమముగా 1 చొప్పున కలవు. క్షుధా 3, తృష్ణ 9, నిద్ర 1, ఆలస్యం 9, ఉద్యోగం 9, శాంతం 7, క్రోధం 5, దంబం 7, మిత్రభేదం 11, ఇష్టత 9, రసనిష్పత్తి, ఫలితం ఉత్సాహం 1 చొప్పున, జ్ఞానం 13, అజ్ఞానం 13, కపటం 17, నిష్కపటం 9, ధార్మికం 17, అధార్మికం 1, అతివృష్టి 3, అనావృష్టి 3,స్వచక్రభయం 11, పరచక్ర భయం 15 ఇత్యాది.

## మాసాధిపతులు - దైవనామాలు

| | మాసము | మగశిశువు | ఆడశిశువు |
|---|---|---|---|
| 1. | చైత్రము | కృష్ణ | భూదేవి |
| 2. | వైశాఖము | అనంత | కల్యాణి |
| 3. | జ్యేష్ఠము | అచ్యుత | సత్యభామ |
| 4. | ఆషాఢము | చక్రి | పుణ్యవతి |
| 5. | శ్రావణము | వైకుంఠ | రూపవతి |
| 6. | భాద్రపదము | జనార్దన | ఇందుమతి |
| 7. | ఆశ్వయుజము | ఉపేంద్ర | ఇంద్రావతి |
| 8. | కార్తీకము | యజ్ఞేశ్వర | లక్ష్మి |
| 9. | మార్గశిరము | వాసుదేవ | వాగ్దేవి |
| 10. | పుష్యము | హరనాథ | పద్మావతి |
| 11. | మాఘము | గోవింద | శ్రీదేవి |
| 12. | ఫాల్గుణము | పుండరీకాక్ష | సావిత్రి |

# 1998-99 శ్రీ బహుధాన్యనామ సంవత్సర మాసాధిపతులు

| వెం. | ఇంగ్లీషు తేదీలు | తెలుగు మాసములు | అశ్వినీ మఘ మూల | భరణి పుబ్బ పూ॥షా | కృత్తిక ఉత్తర ఉ॥షా | రోహిణి హస్త శ్రవణం | మృగ చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ॥భా | పుష్యమి అనూరాధ ఉ॥భా | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 29-3-98 | చైత్రం | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 2 | 27-4-98 | వైశాఖం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 3 | 26-5-98 | జ్యేష్ఠం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 4 | 25-6-98 | ఆషాఢం | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు |
| 5 | 24-7-98 | శ్రావణం | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 6 | 23-8-98 | భాద్రపదం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 7 | 21-9-98 | ఆశ్వయుజం | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి |
| 8 | 21-10-98 | కార్తీకం | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు |
| 9 | 20-11-98 | మార్గశిరం | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు |
| 10 | 19-12-98 | పుష్యం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 11 | 18-1-99 | మాఘం | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి |
| 12 | 17-2-99 | ఫాల్గుణం | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు |

ఫలితములు: జన్మ లేక నామ నక్షత్ర గడికి క్రింది వరుసలోని మాసాధిపతికి గల ఫలితములను ప్రక్క పేజిలో చూసుకోవలెను.

## మాసాధిపతుల ఫలితములు

రవి : పనులతొందర, ఒత్తిడి, ఆలస్యం, తూర్పుప్రయాణము. దుఃఖం, శిరోవేదన, భయం, రాజభీతి, నిరుత్సాహం, ఆశాభంగం, శ్రమ, కోపం. శాంతికి - రుద్రాభిషేకం, సూర్యస్తుతి.

బుధ : బంధు గోష్ఠి, విద్వజ్జన సంగమం, వర్తక జనస్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్యసంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి. శాంతికి - విష్ణుభక్తి.

రాహు : ఆతృత, స్మశాన దర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు, బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగలభయం. గుండె జబ్బు, క్షయ, ఉబ్బసము వంటి దీర్ఘరోగ బాధ. శాంతికి - దుర్గాపూజ, రాహుస్తుతి.

గురుడు : ధనలాభం, గురు ఆదరణం, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతానసౌఖ్యం, పడమరకు ప్రయాణం, మంచి వస్త్రధారణ, స్థిరవృద్ధి, సర్వశుభం.

కేతువు : బంధువైరం, దుష్టస్త్రీ పీడ, మనోచాంచల్యం, దైవభక్తి, అతికోపం, దీర్ఘతర్కం, పుణ్య కర్మలు, స్వల్పాధికారం కలుగుతుంది, పామువల్ల ప్రమాదం, తఱచుద్రవ్యనష్టం. శాంతికి - మహారుద్రాభిషేకం, కేతుస్తుతి.

చంద్రుడు : మాతృసౌఖ్యం, దధ్యన్న సౌఖ్యం, స్త్రీ సంభోగసుఖం, మనోనిర్మలత, ఆనందం, గౌరవం, కృషి, వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వ ప్రయత్నసిద్ధి, స్త్రీ సహాయం, శుభం.

శని : నల్లని జంతువుల వలన భయం, నల్లని వస్త్ర లాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తా శ్రవణం, నీచకార్యాచరణము, బుద్ధి మాంద్యము, అనవసర ప్రసంగము, విరక్తి, గర్భశూల, గుండెపోటు. శాంతికి - రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.

శుక్రుడు : తెల్లని బట్టను ధరించుట, పరిమళ ద్రవ్యోప యోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం, మధురపదార్థలాభం, ధనలాభం, స్త్రీ లాభం, గో లాభం, సర్వం సుఖం.

కుజుడు : అధికారుల బెడద, ఆయుధముల వలన భయము, కార్యనాశనం, మనస్తాపం, మనో కాఠిన్యం, దక్షిణ, నైఋతి దిశ ప్రయాణం, ఔషధసేవ, ధనాలోచన, ధనమునకు యిబ్బంది, అకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకము. శాంతికి - శివునకు అభిషేకం, కుజస్తుతి.

* * *

## శ్రీ బహుధాన్య నామ సంవత్సర ప్రతదిన పట్టిక

| 1998-99 | శుక్లపక్షము | | | | కృష్ణపక్షము | | | | నక్షత్రములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మాసములు | ప్రతి పత్ | షష్ఠి | ఏకాదశి | ○ పూర్ణిమ | ప్రతి పత్ | ఏకాదశి | మాస శివ రాత్రి | ● అమా వాస్య | కృత్తిక | రోహిణి | ఆర్ద్ర | పున ర్వసు | శ్రవ ణం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| మార్చి '98 | 29 | - | - | - | - | - | 26 | - | 4 | 5 | 7 | 8 | 24 |
| ఏప్రిల్ | 27 | 2 | 7 | 11 | 12 | 22 | 25 | 26 | 28 | 29 | 4 | 5 | 20 |
| మే | 26 | 2,31 | 7 | 11 | 12 | 22 | 24 | 25 | 25 | 26 | 1,28 | 2,29 | 18 |
| జూన్ | 25 | 30 | 5 | 10 | 11 | 20 | 22 | 24 | 22 | 23 | 25 | 26 | 14 |
| జూలై | 24 | 29 | 5 | 9 | 10 | 19 | 22 | 23 | 19 | 20 | 22 | 23 | 11 |
| ఆగష్టు | 23 | 28 | 4 | 8 | 9 | 18 | 20 | 22 | 15 | 16 | 18 | 19 | 8 |
| సెప్టెంబరు | 21 | 27 | 2 | 6 | 7 | 16 | 19 | 20 | 12 | 13 | 14 | 15 | 4 |
| అక్టోబరు | 21 | 26 | 2,31 | 5 | 6 | 16 | 18 | 20 | 9 | 10 | 12 | 13 | 1,29 |
| నవంబరు | 20 | 25 | 30 | 4 | 5 | 14 | 17 | 19 | 5 | 6 | 8 | 9 | 25 |
| డిశంబరు | 19 | 24 | 29 | 3 | 4 | 14 | 17 | 18 | 3,30 | 4,31 | 5 | 6 | 22 |
| జనవరి '99 | 18 | 23 | 27 | 2,31 | 3 | 13 | 16 | 17 | 26 | 27 | 2,29 | 3,30 | 19 |
| ఫిబ్రవరి | 17 | 21 | 26 | - | 1 | 12 | 14 | 16 | 23 | 24 | 25 | 26 | 15 |
| మార్చి | 18 | - | - | 2 | 3 | 13 | 16 | 17 | - | - | - | - | 14 |

## వార, తిథి, నక్షత్ర శూలలు

తూర్పునకు: మంగళవారం శుభము. శని, సోమవారములు పనికిరావు. 23 ఘడియల పై శూల దోషములేదు. 1, 9 తిథులు, జ్యేష్ఠ, ధనిష్ట నక్షత్రములు, తులా, కుంభ లగ్నములు కూడవు.

పడమరకు: బుధ, గురువారములు శుభము. ఆదిత్య, శుక్రవారములు దోషములు. ఈ శూలదోషము 22 ఘడియల తరువాత లేదు. 6, 14 తిథులు, పుష్య, రోహిణీ నక్షత్రములు, ధనుస్సు, సింహము లగ్నములు కూడవు.

ఉత్తరము: ఆది, శుక్రవారములు శుభము. మంగళ, బుధవారములు దోషము. ఈ దోషము 25 ఘడియలు తరువాత లేదు. 2, 10 తిథులు, హస్త, పుబ్బ నక్షత్రములు, వృషభ, కన్యా లగ్నములు కూడవు.

దక్షిణము: శని, సోమవారములు శుభము. గురువారము దోషము. ఈ శూల దోషము 22 ఘడియలు తరువాత లేదు. 5, 13 తిథులు, శ్రవణం, అశ్వినీ నక్షత్రములు పనికిరావు. మీన, వృశ్చిక లగ్నములు కూడవు.

* * *

# ప్రశ్న ప్రకరణము

1. ప్రశ్నవిషయము : ప్రశ్నించిన వేళకు లగ్నము మేషమైనచో మానవవిషయము, వృషభమైన పశు విషయము, మిధునమైన ధన పరము, కటకమైన వ్యవహారము, సింహమైన రాజకీయము, కన్యయైన వధూ ప్రసక్తి, తులయైన లోహ విషయం, వృశ్చికమైన వ్యాధి, ధనుస్సయిన ధనపరము, మకరము మనోచింత, కుంభం గృహ విషయము, మీనమైన ప్రయాణ విషయము అని తెలుప వలెను.

2. పనియగునా? కాదా? : ప్రశ్నించినవేళకు లగ్నము మీన మిధున కన్యలైన శీఘ్రముగా పని యగును. తులా, కుంభ, వృషభములైన కార్యసాఫల్యము. మేష ధనుస్సింహము లందు కార్యాలస్యము, మకర, వృశ్చిక, కటకము లందు కార్య నాశనమని ఎరుగ వలెను.

3. పుట్టబోవునది స్త్రీ శిశువా? పురుష శిశువా? : ప్రశ్న లగ్నం నుండి 9-5-7-3 స్థానములందు రవి, కుజ, గురులున్నచో పుత్రుడని, 2-4-6 స్థానములలో చంద్ర, శుక్రులున్నచో పుత్రికయని, 2-4-6-8 స్థానములలో శని, బుధులున్నచో నపుంసకులని చెప్పవలెను. లగ్నాత్తు చతుర్థమున ఎన్ని గ్రహము లుండిన అందరు సంతానమని అనగా 2 వున్న కవలలని, 3 వున్న ముగ్గురని చెప్పటకూడా కలదు.

4. మరియొక పద్ధతి : గర్భిణీ స్త్రీ యొక్క నామాక్షరముల సంఖ్యను 7చే గుణించి దానికి ఆనాటి తిథి సంఖ్యను కలిపి, 9చే భాగించవలెను. వచ్చిన శేషము సరి సంఖ్యయైన స్త్రీ శిశువని, బేసియైన పురుష శిశువని తెలియ వలెను.

5. ప్రయాణ లాభాలాభములు : తన నీడ వల్ల కలిగిన పాదచ్ఛాయల సంఖ్యను 3చే గుణించి 13 కలిపి 8చే భాగించగా శేషం 1 అయిన ధనలాభం, 2 ధన నాశనం, 3-4-7 లయిన ప్రమాదం, 5-6 లయిన శుభం, 8 అయిన ప్రాణాపాయ మని చెప్పవలెను.

6. దేశాంతర మేగిన వారు ఎప్పుడు వత్తురు? : ప్రశ్న లగ్నమున బుధ, చంద్ర, కేతువులున్నచో తిరుగు మార్గమందున్నాడని, గురు, శుక్రులున్న చేరువకు చేరినాడు. ఒకటి రెండు నాళ్ళలో రాగలడని, కుజ, రవులున్నచో ఇంకా అక్కడనే ఉన్నాడని, శని, రాహువులున్నచో అనారోగ్యము వలన రాలేకపోయినాడని తెలియవలెను.

7. మరి యొక్క పద్ధతి : ప్రశ్నించిన వానిని 27 అంకె లోపల ఒక అంకె చెప్పమని అది అశ్విన్యాది నక్షత్రములలో ఏ నక్షత్రమగునో చూచి, ఆర్ద్ర మొదలు ఆ నక్షత్రమువరకు లెక్కించి దానిని 7 చే భాగించగా శేషం 1 అయిన శీఘ్రముగా వచ్చునని, 2 అయిన అక్కడనే వున్నాడని, 3 అయిన యింటికి వచ్చుచున్నాడని, 4 సమీపమునకు చేరుకున్నాడని, 5 మార్గ మధ్య మందున్నాడని, 6 జబ్బుపడి యున్నాడని, 7 మృత్యు గతమని తెలియ వలెను.

8. నష్టద్రవ్య ప్రశ్న : కేంద్ర, త్రికోణ, అష్టమ, ధన (4,7,10,11,9,8,2) స్థానములందు శుభ గ్రహ సంబంధము లేనివీ, పాప గ్రహ సంబంధముతోయున్న పాపులున్న యెడల పోయిన సొమ్ము దొరకదనియు, ఆ ప్రయత్నమందు మరికొంత ద్రవ్యము ఖర్చు అగునేగాని ప్రయోజన ముండదని తెలుపవలెను. మరియు 1,5,9,2,3,10,11 స్థానములలో శుభ గ్రహములు బలవంతులై యుండగా 1,5,9,4,7,10,8,11 స్థానములలో పాప గ్రహములు లేని యెడల పోయిన సొమ్ము తిరిగి దొరుకునని చెప్ప వలెను.

9. నక్షత్రమును బట్టి చోర ప్రశ్న : 1. రోహిణి, పుష్యమి, ఉత్తర, విశాఖ, పూర్వాషాఢ, ధనిష్ఠ, రేవతి -- అను యీ 7ను అంధక నక్షత్రము లనబడును. ఈ తారల యందు దొంగిలింప బడిన వస్తువులు తిరిగి లభించునని చెప్పబడినది. 2. మృగశిర, ఆశ్రేష, హస్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శతభిషం, అశ్విని -- ఇవి 7ను మందాక్షము లన బడును. ఈ తారలలో పోయిన సొమ్ము కొంచెము ప్రయత్నముపై లభించును. 3. ఆర్ద్ర, మఖ, చిత్త, జ్యేష్ఠ, అభిజిత్, పూర్వాషాఢ, భరణి -- ఈ 7ను మధ్యమములు. ఈ తారలందు పోయినవి తిరిగి లభించుట కష్టం. మిక్కిలి ప్రయాసముపై లభించిన లభించ వచ్చును. 4. పునర్వసు, పుబ్బ, స్వాతి, మూల, శ్రవణం, ఉత్తరాభాద్ర, కృత్తిక ఈ 7ను సులోచనము లనబడును. ఈ తారలలో పోయిన వస్తువులు తిరిగి దొరుకుట అరుదు అని రత్నమాలావచనము.

10. ఉద్యోగ ప్రశ్న : ప్రశ్న లగ్నమునకు 7, 10 స్థానములలో శుభ గ్రహములున్నను లేదా శుభగ్రహ వీక్షణమున్నను త్వరలో ఉద్యోగము లభించునని చెప్పవలెను.

11. పెండ్లి ఎప్పుడు జరుగును : ప్రశ్న లగ్నము మేషము లగాయితు సమరాశు లందుండి, శుక్రుడు సమరాశులలో యున్నచో త్వరలోనే పెండ్లి జరుగునని చెప్ప వలెను.

## నవరత్నముల ఉంగరము

సర్వ గ్రహోమగ్రహములకు, పీడాపరిహారమునకును, సర్వులూ ధరించదగినది నవరత్నముల ఉంగరము. ఇందు ఏఏ రత్నము ఎచ్చట మండవలెనో ఈ దిగువ చిత్రమునందు చూపబడినది.

| ఈశాన్యం | తూర్పు | | | ఆగ్నేయం |
|---|---|---|---|---|
| | బుధ<br>పచ్చ | శుక్ర<br>వజ్రం | చంద్ర<br>ముత్యం | |
| ఉత్తరం | గురు<br>పుష్యరాగం | సూర్య<br>కెంపు | కుజ<br>పగడం | దక్షిణం |
| | కేతు<br>వైఢూర్యం | శని<br>నీలం | రాహు<br>గోమేధికం | |
| వాయవ్యం | పశ్చిమము | | | నైఋతి |

ఇట్టి ఉంగరము ధరించుటచే-దీర్ఘరోగములు, శత్రుత్వములు ఋణపీడలు తొలగిపోవును. ఆదాయము వృద్ధియగును. వ్యసనములు నశించును. సత్సాంగత్యము కల్గును. కుటుంబసౌఖ్యం, సత్సంతానం దైవభక్తి, సర్వసంపద్వృద్ధి కలుగును. చంద్రబలాదులును చూచుకొని ఇష్టదైవమువద్ద వుంచి పూజించి అనంతరము ధరించవలెను.

శ్రీ

# వర్ష యోగములు

**చైత్రమాసము:** ఇందు గురు శుక్ర రాహువులకు అమృత జల రసనాడులు, మిగిలిన గ్రహములకు వాయు మహావాయు దహన నాడులందు సంచారము. శు.3 శన్యస్తమయము, శు.8 కుజ చలనము. బ.5 శని మేష ప్రవేశము. శు.4ల గురుశుక్ర సమాగమము. శు.3ల॥ బ.8 వరకు బుధోవక్రీ ఋజుశ్శుక్రః. మీనమందు పంచగ్రహకూటం, చతుగ్రహ కూటమీకలవు. మాసమంతయు మేఘాడంబరము కల్గి ఆకస్మిక వర్ష సూచనలు కల్గును. చాంద్రయోగములచే మార్చి 29,30, ఏప్రిల్ 4,5,10,11,12,14,15,17,25,26 తేదీలలో వర్ష సూచనలు కల్గును.

**వైశాఖమాసము:** ఇందు గురు శుక్ర రాహువులకు రసజల సౌమ్య- రవికుజ బుధ శనులకు వాయు మహావాయు నాడులందును సంచారము. బ.4 కుజ చలనము శు2ల శు.14 వరకు బుధ శుక్రులకు ఏకరాశిస్థితి, బ.14ల బుధ శుక్ర సమాగమము. శు. 2 వరకు గురు శుక్ర సమాగమము. బ. 11 ల కాల సర్పయోగము. మాసమంతయు గాలిదుమారములు గ్రీష్మాధిక్యత. శుద్ధమున ఖండవృష్టి, బ॥న అనావృష్టి. చాంద్రయోగములచే ఏప్రిల్ 27. మే 5,6,7,12,13,17,18 తేదీలలో ఖండవృష్టి.

**జ్యేష్ఠమాసము:** ఇందు గురు రాహువులకు రసజల- మిగిలిన గ్రహములన్నిటికీ వాయు మహావాయు దహన నాడులందును సంచారము. శు.13 శన్యుదయము, శు.4 వరకు బుధ శుక్రులకు ఏకరాశిస్థితి, బ.2ల॥ బ.5 వరకు పురోబుధుడు. బ.5ల బ.13 వరకు ఆర్ద్రా బుధుడు. బ.8ల॥ మృగశిరా కుజుడు మొ॥గు వర్షయోగములు, శు.4ల బ.8 వరకు రోహిణీ కుజుడు, శు.7 వరకు కాలసర్పయోగము కలదు. శుద్ధమున గాలి దుమారములు గ్రీష్మాధిక్యము, వాయు ప్రాబల్యము కలిగి అమావాస్య ప్రాంతమున వర్ష సూచనలు. చాంద్రయోగములచే మే 26,27, జూన్ 3,4,8,9,14,15,22,23 తేదీలలో ఖండవృష్టి.

**ఆషాఢమాసము:** ఇందు శుక్ర శనులకు వాయు దహన - మిగిలిన గ్రహములకు సౌమ్య రసజల అమృత నాడులందును సంచారము. శు.3 కుజ చలనము, శు.3ల॥ బ.8 వరకూ పురో బుధుడు, శు.14ల॥ బ.12 వరకు ఆశ్లేషా బుధుడు, శు.13 వరకు మృగశిరాకుజుడు. శు.13ల॥ ఆర్ద్రా కుజుడు. శు.3ల॥ బ.5 వరకు పురోబుధ రవి మధ్యమము. బ.12ల॥ పురోబుధ రవి మధ్యమము. బ.5ల॥ కాల సర్పయోగము. మాసమంతా మేఘాడంబరము వాయు ప్రాబల్యము కల్గి పూర్ణిమా ప్రాంతమున వర్షము. చాంద్రయోగాలచే జూన్ 27,28 జూలై 1,2,4,12,20,23 తేదీలలో వర్షములు.

**శ్రావణమాసము:** ఇందు శనికి వాయు-మిగిలిన గ్రహములన్నింటికీ రసజల సౌమ్య అమృత నాడులందును సంచారము. బ.4 అంగారక చలనము. బ.3ల బుధ శుక్రులకు ఏకరాశి స్థితి. బ.9 ల॥ బుధో వక్రీ ఋజుశ్శుక్రః. బ.3 వరకు పురోబుధుడు వృష్టిప్రదములు. శు.15 వరకు పురో బుధ రవి మధ్యమము. శు.4 వరకు ఆర్ద్రాకుజుడు. బ.3 వరకు కాలసర్పయోగము. శు.15 ల బ.3 వరకు గురుశుక్ర షష్ఠాష్టకము. మాసమంతయు మేఘాడంబరము కల్గి అధిక వర్షములు. చాంద్రయోగములచే జూలై 26,27,30,31, ఆగష్టు 4,5,7,17,21 తేదీలలో వర్షము.

భాద్రపదమాసము: ఇందు శనికి వాయు- ఇతర గ్రహాలకి అమృత జల నాడులందు సంచారము. శు.10 వరకు బుధ శుక్ర సమాగమము. శు.12 ల బ.30 వరకు బుధ శుక్రులకు ఏకరాశిస్థితి శు.2 వరకు బుధో వక్రీ బుజుశ్శుక్రః శు.10ల పశ్చిమ, మఘాది పంచక శుక్రుడు, శు.15లి ఆశ్రేషా కుజుడు, బ.5ల గురు శుక్ర సమసప్తకము. బ.5ల గురు శుక్రషష్ఠాష్టకము. శుllన వర్షములు, బllన అనావృష్టి. చాంద్రయోగములచే ఆగష్టు 26,27,29,1,2,4,5,8,9,10,18,19 తేదీలలో వర్షము.

ఆశ్వయుజమాసము: ఇందు శనికి వాయు- మిగిలిన గ్రహములకు సౌమ్య, రస, జల అమృత నాడీసంచారము కలదు. శు.6 అంగారక చలనం శు.8 శుక్రాస్తమయము బ.3 లి 12 వరకు పురోబుధుడు, శు.7లి సింహాంగారకుడు. మాసమంతయు పశ్చిమదిశ మఘాది పంచక శుక్రుడు. శు 6 వరకూ ఆశ్రేషా కుజుడు. శు 5 వరకు గురు శుక్ర సమ సప్తకము. శు 5లి అమావాస్య వరకు గురు శుక్ర షష్ఠాష్టకము. శుద్ధమున అనావృష్టి. పూర్ణిమా ప్రాంతమున అధిక వర్షములు. చాంద్రయోగములచే సెప్టెంబరు 25, 26, 27, 28, 29, 8, 15 తేదీలలో వర్షములు.

కార్తీకమాసము: ఇందు కుజ గురు రాహువులకు జల రస- మిగిలిన గ్రహములకు వాయు మహావాయు దహననాడులందును సంచారము. శు.1లి శు.8 వరకు బుధ శుక్ర సమాగమము. బ.9లి బుధ శుక్రులకు ఏకరాశిస్థితి, బ.9లి బ.13 వరకు పురశ్శుక్రుడు. శు.8లి బ.13 వరకు పురోబుధుడు వృష్టిప్రదములు. శు.5 వరకు పశ్చిమదిశమఘాది పంచక శుక్రుడు. బ.12లి ప్రాగ్దిశి స్వాతీ త్రయశుక్రుడు. బ.7 వరకు ఉత్తర కుజుడు. బ.13వరకు కుజ శని షష్ఠాష్టకము. బ. 13 వరకు సింహాంగారకుడు అనావృష్టి ప్రదములు. శు.2 ప్రాంతమున పశ్చిమాన గాలితోకూడిన వర్షములు. చాంద్రయోగములచే అక్టోబరు 22,23,26,29,30,31. నవంబరు 3,4,8,9,12,13,16,17 తేదీలలో గాలితో కూడిన వర్షములు.

మార్గశిరమాసము: ఇందు కుజ గురులకు వాయు మహావాయు దహన-మిగిలిన గ్రహములకు రససౌమ్య అమృత నాడులందును సంచారము. బ.2 శుక్రోదయము, బ.3 వరకు బుధ శుక్ర సమాగమము. శు.3ల బ.8 వరకు బుధో వక్రీ బుజుశ్శుక్రుడు, బ.3 లి బ.3 వరకు పురశ్శుక్రుడు, శు.7 వరకు ప్రాగ్దిశి స్వాతీత్రయ శుక్రుడు. బ.1 వరకు ఉత్తర కుజుడు. శుద్ధమున అనావృష్టి బహుళమున మేఘాడంబరము ఆకస్మిక వర్ష సూచనలు. చాంద్రయోగములచే నవంబరు 20,21,24,25,28,29, డిసెంబరు 3,4,7,8,12,13,14 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు.

పుష్యమాసము: ఇందు బుధశనులకు వాయు మహావాయు దహన- మిగిలిన గ్రహములకు సౌమ్య రస, జల అమృత నాడులందును సంచారము. బ.10 అంగారక చలనము. శు.12 లి పురశ్శుక్రుడు, బ.11లి శని కుజ సమ సప్తకము. మాసమంతా మేఘాడంబరము, పూర్ణిమా ప్రాంతమున ఖండవృష్టి. చాంద్రయోగములచే డిసెంబరు 22,23,26,27,30,31, జనవరి. 5,6,12,15,16 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు.

మాఘమాసము: ఇందు కుజ శనులకు దహన వాయు--మిగిలిన గ్రహములకు రస సౌమ్య జల అమృత నాడులందును సంచారము. శు.5ల శు. 6 వరకు బుధ శుక్ర సమాగమము, బ.9లి అమావాస్య వరకు బుధ శుక్రులకు ఏకరాశిస్థితి, శు.6లి బ.12 వరకు పురశ్శుక్రుడు. బ.9లి బ.12 వరకు పురోబుధుడు. శు.11లి స్వాతీ కుజుడు.

శుద్ధమున మేఘాడంబరము, ఖండవృష్టి. చాంద్రయోగములచే జనవరి 18,19,24,25,29,31, ఫిబ్రవరి 1,7,8,16 తేదీలలో కుంభవృష్టి.

**ఫాల్గుణమాసము:** ఇందు కుజ, శనులకు వాయు మహావాయు- మిగిలిన గ్రహములకు జలరస సౌమ్య అమృత నాడులందుమ సంచారము. శు.1లు 11 వరకు గురు శుక్రులకు ఏకరాశి స్థితి, శు.11లు బుధ గురు సమాగమము. శు.1లు వరకు పురశ్శుక్రుడు. శు.11లు బ.12 వరకు పురోబుధుడు, మాసమంతయు స్వాతీ కుజుడు. పూర్ణిమా ప్రాంతమున వర్ష సూచనలు. చాంద్రయోగములచే ఫిబ్రవరి 17,20,21,22,25,26, మార్చి 1,2,6,7,11,12లలో ఆకస్మిక వర్ష సూచనలు.

* * *

## పరకుల ధరలు

**చైత్రమాసము:** ఈ మాసమంతయు రాగి, వెండి తప్ప ఇతర లోహములకు ధరలు పెరుగును. శుద్ధ 4 వరకు నెయ్యి, మణులు, ముత్యములు, ఆకులు, వక్కలు, శ్రీ ఫలములకూ - శుద్ధ 8 నుంచి కుంకుళ్లూ, పొట్టు ధాన్యాలకూ ధరలు పెరుగును. బహుళ విదియ వరకూ అన్నింటికీ ధరలు పెరిగి, పసుపు - నువ్వులు ధరమాత్రం నిలబాటగును. బహుళములో వస్త్రవాహనములకు పండ్లు, చెరకు, గుర్రములు, తిలతైలాదులకూ, ఉప్పుకూ కూడా ధరలు హెచ్చును.

**వైశాఖమాసము:** శుద్ధములో పొట్టుధాన్యాలు, వక్కలు, ఏలకులు, జాజిఫలాలు, కొబ్బరి, పెసర, కుంకు మాదులకు ధరలు పెరుగును. శుద్ధ 14 నుండి బహుళ 8 వరకు యవలు, గోధుమ, మిర్చి, బెల్లం, నెయ్యి, పాలు ధరలు సమం. తదాది ఏనుగులు, భారీవాహనాలు, ధాన్యం, వాలాజీ, వస్త్రాలు, నువ్వులు, చింతపండు, మినుములు ధర పెరుగును. పసుపు, కొబ్బరి ధరలు నిలబాటు. లోహములకు ధర హెచ్చి నిలబాటు అగును. వెండిధర తగ్గును.

**జ్యేష్ఠమాసము:** శుద్ధ 4 వరకు ధాన్యాలకూ, తదుపరి శుద్ధ 14 వరకూ దూదీ, నూలూ, వస్త్రములు, నువ్వులు, నూనెలకూ ధర పెరుగును. శుద్ధ 13 నుంచి లక్క, స్ఫటికం, అన్ని రకముల వాహనాలు, గుఱ్ఱాలు, ఏనుగులకు వెలలు హెచ్చును. బహుళ 6 వరకూ గోధుమ, మినుము, బంగారం, భోజన పదార్థాల వెలలధికం. ఈ మాసము మొత్తము మీద జీలకర్రకూ, సర్వధాతువులకూ, రసద్రవ్యములకూ ధరలు పెరుగును.

**ఆషాఢమాసము:** నెల ప్రారంభంలో ప్రత్తి, నూలు, వస్త్రములకు ధరలు మాంద్యముగా ఉండి బహుళ 9 నాటికి పెరుగును. శుద్ధములో ఉప్పు, మిర్చి, చింతపండు, తైలములు, బెల్లం, కస్తూరి, సుగంధ ద్రవ్యాలకూ శుద్ధ 13 నుంచి పువ్వులూ, ప్రత్తీ, పట్టు, పచ్చలకూ మాసాంతంలో బహుళ 12 నుంచి వెండి బంగారాలూ, వార, ఆవాలూ, సజ్జలకు ధరలు పెరుగును.

**శ్రావణమాసము:** శుద్ధ,10 వరకు వెండి బంగారాలకీ - శుద్ధ 4 నించి నువ్వులూ, నూనెలూ, గేదెలు, ధాన్యాదులకీ - బహుళ 10 నించి నెయ్యి, బెల్లం, నల్లఅవిసె, శనగలు, పగడాలకీ ధరలు హెచ్చును. మొత్తముమీద మాసమంతయు ధాన్యములు, వస్త్రములు, కూరలు, కొఱ్ఱలు, కొబ్బరి, వేరుశనగ, పెసర, మినుము, చింతపండులకు ధరలు సమము. సజ్జలు, గోధుమలు, బెల్లం ధరలధికం.

భాద్రపదమాసము: మాసమంతయు కందులు, పెసలు, మిర్చి, మినుము, గుగ్గిలము, ధాన్యములకు ధరలు పెరుగును. నువ్వులు, పసుపుల ధర నిలబాటు. శుద్ధ 9 లగాయితు కంబళ్లు, ధావళీలు, ఆవులు, నువ్వులు, వెండి ధరలు హెచ్చును. బహుళ 9 ల॥ ఎద్దులు, పెసర, బియ్యం, క్రొరలు, సైంధవ లవణం, ఉల్లి, మిర్చీలకును బహుళ 12 వరకు నూనెలు, బెల్లం ధర పెరుగును.

ఆశ్వయుజమాసము: శుద్ధ 6 వరకు ధాన్యమునకూ, తదాది బహుళ 14 వరకు నువ్వులూ, మినుములకూ ధర హెచ్చును. మాసమంతా పసుపు, కొబ్బరి ధరల నిలబాటు. వెండికి ధర తగ్గే సూచన. వాలాజీ, వస్త్రాలూ, చింతపండు ధరలు పెరుగును. బహుళ 12 నాటికి కుండలూ, కొబ్బరి ధరలు పెరిగిననూ తదాది సమముగా నుండును. పౌర్ణమికి ముందు వనసంపదకి అధికంగానూ - నిత్యాహార పదార్థాలకు స్వల్పంగాను ధరలు పెరగవచ్చును. బహుళ 6 నుంచి రత్నాలు, బంగారం, బెల్లం, మినుములు, పగడాలు, గుర్రాలకు ధరలు పెరుగును.

కార్తీకమాసము: శుద్ధ 4 లగాయితు ఆవాలు, మిరియాలు, నూనె పదార్థాలు, అలచందలు, ఇంగువ, ఖర్జూరాలకు - బహుళ 5 లగాయితు పెసర, చిరుశనగ, ఆహార పదార్థాలకు ధరలు పెరుగును. శుద్ధంలో అగరు నూనెలకూ, బహుళంలో నెయ్యి, వరి, వాహనాలూ, గుఱ్ఱాలు, చెరుకులకూ - మాసం మొత్తంమీద మిర్చి, చింతపండు, బెల్లం ధరలధికం. అపరముల ధరలు సమం.

మార్గశిరమాసము: ఈ మాసమంతయు చింతపండు, ధాన్యము, కూరలు, పెసర, మినుము, నువ్వులు, వేరుశనగల ధరలు సమముగా నుండి పసుపు, బెల్లం, గోధుమల ధరలు హెచ్చును. శుద్ధంలో వడ్లు, బియ్యం, అపరములు, శనగలకూ- బహుళములో లక్క, బెల్లం, గుగ్గిలం, కర్పూరం, పాదరసం, ఇంగువలకూ-మాసాంతమందు ఉప్పుతో సహా తెల్లని పదార్థాలకీ ధరలు పెరుగును.

పుష్యమాసము: శుద్ధ 11 వరకు తెల్లని వస్తువులకు - తదాది పత్తి, వక్కలు, కరక్కాయలు, ఏలకులు, జాజికాయలు, టెంకాయలు, పొట్టుధాన్యాలూ, కందులు, పెండలం, మూల వస్తువులు, వడ్లు, డ్రైఫుడ్స్‌కి ధరలధికం. నేతికీ, బెల్లానికీ, ఉప్పుకూ కూడా ధరలు పెరుగు సూచనలు. బహుళంలో పసుపు, కూరలు, చింతపండు ధరలు తగ్గుముఖం పట్టును. ఇనుము, కంబళ్లు ధరలు పెరుగును. తిలా తైలములకూ, ప్రత్తి, నూలు, వస్త్రములకూ ధర పెరుగును.

మాఘమాసము: శుద్ధములో దూది, వస్త్రములు, కంబళ్లు, గోధుమ, బెల్లం, శనగలకు ధర హెచ్చును. వాలాజీ వస్త్రాలు, పెసర, మినుములు ధరలు పెరుగను. మాసం మొత్తం మీద పసుపు ధాన్యాలూ, పసుపు కొమ్ములూ, కొబ్బరి ధరలకు నిలబాటు. వక్కలు, ఏలకులు, వాహనాలు, గుర్రాలు, ఏనుగులు ధర పెరుగును. కంచు, వెండి ధరలు మాంద్యం. అయినా, మాసాంతంలో లోహాలకీ, నవరత్నాలకీ, భోజన పదార్థాలకీ ధరలు పెరుగుతాయి.

ఫాల్గుణమాసము: ఈ నెల దూదికీ, గోధుమలకూ, రస ద్రవ్యములకూ, సుగంధ ద్రవ్యములకూ ధరలు పెరుగును. శుద్ధంలో వెండి, బంగారం, నవరత్నాలకు - బహుళంలో తేనె, బెల్లం, పంచదార, వడ్లుకూ ధరలు హెచ్చును. మొత్తం మీద ఈ మాసములో నేలశనగలు మొదలు - సముద్రపు ఉప్పు వరకు ధరలు పెరుగుచునే ఉండును.

* * *

# శ్రీ బహుధాన్యనామ సంవత్సర రాశి ఫలితములు

## మేషరాశి

(అశ్వని 1,2,3,4 పాదములు, భరణి 1,2,3,4 పాదములు, కృత్తిక 1వ పాదము)

ఆదాయం: 2 వ్యయం: 14 రాజపూజ్యం: 5 అవమానం: 7

ఈరాశి వారికి గురుడు ఉగాదినుండి 1999 జనవరి 12 వరకు 11ట రజతమూర్తి. తదాది వత్సరాంతము వరకు 12 ట లోహమూర్తి. ఏప్రిల్ 17 వరకు శని 12ట తామ్రమూర్తి. తదాది వత్సరాంతం వరకు జన్మమందు రజతమూర్తి. వత్సరాదినుండి 99 జనవరి 11 వరకు రాహువు 5ట, కేతువు 11ట తామ్రమూర్తులు. తరువాత రాహువు 4ట, కేతువు 10ట రజితమూర్తులు.

ఈ రాశివారికి లాభస్థానమందు గురుడు యోగప్రదుడు. ఆంతరంగిక లాభకారకుడు. సంవత్సరాంతమందు శుభ వ్యయకారకుడు. శుభమూలక పెట్టుబడులు, నిర్మాణాది లాభములు కలిగించును. శని జన్మమందున్ననూ సం॥ర మధ్యయందు వక్రముచేత అనుకోని చికాకులు, వ్యవహార అస్థిమితములు, ఆరోగ్య మార్పులు సూచించును. రాహు కేతువులు మిశ్రమ యోగప్రదులు.

వీరు సమయానుకూల వాతావరణం యేర్పరచుకొనుటలో సమర్థులు. ముందుదృష్టి కలవారు, ఇతరులను ఏదో విధముగా మెప్పించియే పబ్బము గడుపుకొనగలుగుదురు. ఏల్నాటి శని ప్రభావముచేత యెంతటి ధీరవంతులయినను, సమయానుకూలముగా మౌనము వహించుట మంచిది. దైవధ్యానము చేయుట కుటుంబమునకు శాంతి. అంగారకుని ప్రభావముచే నేత్రరోగము, కార్య విఘ్నము, ఉదరసంబంధ అనారోగ్యము, శత్రుపీడ.

మొత్తము మీద వృధావ్యయము, త్రిప్పట, సంతాన ఆరోగ్య లోపములు, స్త్రీవైరము, నల్లని జంతుభీతి, కలప-ఇనుము సంబంధిత రక్తదర్శనము మున్నగు ఫలితములు కలుగును. గృహనిర్మాణ ప్రయత్నములు, ఆకస్మిక ఆర్థికవృద్ధి పొందుదురు.

విద్యార్థులు అత్యధిక శ్రద్ధ కలిగిన ఉన్నత విద్యా యోగము నొందుదురు. ఉద్యోగులు, అధికారులు, నూతన వ్యవహారము లాశించువారికి, స్వతంత్రవృత్తులవారికి ఈ సంవత్సరము ట్రైనింగు కాలముగా భావించినచో, భవిష్యత్తులో ఉన్నతిని పొందుదురు.

ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు దూరప్రాంతములకాకస్మిక బదిలీలు, అధికారుల ఒత్తిడులను ఎదుర్కొనవలసి వచ్చును. నూతన ఉద్యోగము లాశించువారికి, దూరప్రయాణములాశించువారికి సంవత్సర మధ్యయందు పరీక్షా కాలముగా నున్ననూ విజయదశమి తరువాత మనోభీష్టములు నెరవేర్చుకొందురు.

వ్యవసాయదారులకు అనుకూలముకాదు. కాంట్రాక్టరులకు సం॥ర పూర్వార్థం మాత్రమే ఒకమాదిరిగా యుండగలదు. వైద్యులు, న్యాయవాదులు, సాంకేతిక వృత్తులవారికి అనుకూలము కాదు. వ్యాపారులు పెద్దపెట్టుబడులు పెట్టక స్వాల్పకాలిక వ్యాపారము ఆశించుట మంచిది. రైస్‌మిల్లులు, కోళ్ళఫారములు, యాంత్రిక వ్యాపారం,సినీ పరిశ్రమల వారికి ఏదో విధముగా లాభించుచున్ననూ, ధనము నిలువకున్ననూ లోటురాదు.

అపరాలు, కిరాణా, వస్త్రములు, బియ్యము, ఫ్యాన్సీ వ్యాపారులకు సంవత్సర మధ్యయందు ఆకస్మికదాడులు ఆర్థిక ఒత్తిడులు ఎదుర్కొనవలసి వచ్చినను, లాభమే కలుగును. రాజకీయము అనుకూలముకాదు.

4,5 మాసములందు స్త్రీజనులందు మనస్తాపము, భోగలాలసత, త్రిప్పట, మనో అస్థిరత, స్థానచలన చింత, సూచించును. 6,7 మాసములందు పుణ్యయాత్రాసిద్ధి, వివాహాది శుభకార్య ప్రయత్నసిద్ధి, సంఘ గౌరవము, తరచూ ప్రయాణములు-కాని, మాతృవర్గ అవరోధములుండును. 8,9 నెలలో సంతానము గురించి శ్రద్ధ, ప్రయాణ జాగ్రత్తలు అవసరం. అజీర్ణము, మోకాళ్ల నొప్పులు సూచించును. 10,11 మాసములందు మాట తొందర, ఉదర సంబంధ ఇబ్బందులు, దూరప్రయాణ వాంఛ, అల్పఉద్యమం, అయిననూ గురు ప్రభావముచే దేవతారాధన, బంధుమిత్ర గోష్టులు, వస్త్రలాభము,

వినోదము వాగ్వివాదములకు పోరాదు. 12,1 మాసములందు అపవాదము, స్వప్నములు, లావాదేవీల గురించి ఆత్రుత. మిగిలిన మాసములందు జంతుభీతి, వ్యాపార ఆందోళన, స్త్రీ అపవాదములు, శస్త్రచికిత్స, శుభకార్యాలరీత్యా ధనవ్యయం కలుగును.

అశ్వినివారికి వైడూర్యము, ముత్యము - భరణివార్కి వజ్రము, పగడము - కృత్తిక వార్కి కెంపు - ధరించుట యోగదాయకములు.

వీరి అదృష్ట సంఖ్య 9. 1,2,3,7 సంఖ్యలు తేదీలతో కూడివచ్చు ఆది, సోమ, శుక్రవారములు అత్యంత యోగదాయకము. మొత్తం మీద ఈ రాశివారు వ్యాపార వ్యవహారములకు దూరముగా వుంటూ సంపూర్ణ నవగ్రహ ఆరాధనలు, ఏకాదశ రుద్రాభిషేకములు, శనివార నియమములు ఆచరించుట మంచిది.

స్త్రీలకు మాత్రము ఈ సంవత్సరము యోగదాయకమనే చెప్పవచ్చును. శని, శుక్ర వారములు, ఈశ్వరాంజనేయ ఆరాధనలు చేయుట వలన కుటుంబము నందు ఆర్థిక ఆరోగ్య లాభములు, కుటుంబములో శాంతి కలుగును.

## వృషభరాశి

(కృత్తిక 2,3,4 పాదములు, రోహిణి 1,2,3,4 పాదములు, మృగశిర 1,2 పాదము)

ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 1 అవమానం: 3

ఈ రాశివార్కి గురుడు 99 జనవరి 12 వరకు 10ట సువర్ణమూర్తి. తదాది వత్సరాంతము 11ట తామ్రమూర్తి. ఉగాది నుండి ఏప్రిల్ 17 వరకు శని 11ట రజతమూర్తి. తదాది వత్సరమంతయు 12ట లోహమూర్తి. ఉగాది నుండి 99 జనవరి 11 వరకు రాహువు 4ట కేతువు 10ట రజతమూర్తులు. తదాది వత్సరాంతం రాహువు 3ట, కేతువు 9ట సువర్ణమూర్తులు.

వీరికి గురుడు 10,11 స్థానములందు యోగప్రదుడు. శుభకార్య అనుకూలత, ఉత్సాహము కలిగించును. రాహువు 4ట ఆటంకములు, అనిద్ర, అస్థిరత్వము, తరచు ప్రయాణములు కలిగించుచుండును. శని పరిపూర్ణ యోగవంతుడు. ఈ సంవత్సరము ఏల్నాటి శని 12ట ప్రవేశించినప్పటికీ, ఉత్సాహ పూరితమైన ప్రయత్నముల ద్వారానూ, శ్రమద్వారానూ, సంతోష పూర్వకమైన ధనవ్యయము ద్వారానూ ఉన్నతిని కలిగించును. శని అపకారి కాడు.

వీరు సంఘమందు ఉన్నత ఆదర్శములు ప్రదర్శించువారు, స్వలాభము లేనిదే ఏ పనీ చేయనివారు, తరచు స్థానమార్పులు, కుటుంబ పరమైన ఘనత చెప్పుకొనుట మొదలగు ఫలితములు పొందుదురు. చేయు వ్యవహారాదులందు నూతనత్వమును పొంది ముందుకు సాగుచుందురు. వివాహాది శుభకార్యములలో పాల్గొందురు.

కుజ ప్రభావముచే 4,5,6,10,11 నెలలందు శస్త్రచికిత్సలు, శిరోవాతము, పిత్తసైత్య అజీర్తి బాధలను ఎదుర్కొనుట, మిత్ర శతృత్వములు, మాటతొందర, మానసిక ఈతిబాధలను పొందుదురు.

4,5 మాసములందు కార్యనిమగ్నత, మానసిక ఒత్తిడి, కృషిలాభం, ప్రియసంభాషణ. 6,7 నెలలలో లోకాపవాదము, సుఖమునకు తాపత్రయము, వస్త్రాభరణ లాభము, ఉదరాదులందు శస్త్రచికిత్సలు, దూరబంధు వ్యయము, సంతానము గురించి ఆందోళన, గృహమందు అశాంతి సూచించును.

9,10 నెలల్లో సంఘగౌరవం, పరులచే ఈర్ష్య, అసంతృప్తి, అధిక ధనసంపాదన, మృష్టాన్న భోజన ప్రాప్తి, పురుష సంతానప్రాప్తి, వ్యాపారాభివృద్ధి కలదు.

10,11 మాసములందు నడుము, చర్మము, పాదముల - ఆరోగ్య లోపములు, స్థిరాస్థి గురించి ఆలోచన, స్వల్పానుకూలత, పరుల సహకారముచే అభివృద్ధి, ఇంద్రియ నిర్వీర్యతను సూచించును.

1,2 మాసములందు వ్యవసాయ ఉద్యోగ లాభములు, అనారోగ్యం, ఖ్యాతి, ధర్మబుద్ధి, పుణ్యక్షేత్ర ప్రదర్శనం, శ్రమకు మించిన ఫలితము పొందుదురు.

విద్యార్థులకు మిశ్రమ ఫలితములు. న్యాయవాద, ఇంజనీరింగు, వైద్యశాఖలవారికి పరీక్షాకాలము. కళాకారులు గుర్తింపు, ప్రశంసలు పొందెదరు. వ్యవసాయదార్లకు విశేషము.

నిలువదారులకు, కంట్రాక్టర్లకు సంIIరాంతము లాభకాలము. రాజకీయము అనుకూలము కాదు. స్వతంత్ర వృత్తుల వారికి శాస్త్రకోవిదులకు శ్రమకు తగ్గ గుర్తింపు కలదు. ఆపరములు, తైలములు, కిరాణా, ఫ్యాన్సీ వ్యాపారులు స్వల్ప పెట్టుబడులతో వ్యాపారము చేయుట మంచిది.

మొత్తం మీద ఈ రాశివారికి శుభకార్య యత్నములు, గృహనిర్మాణాదులు, కొద్ది ఆలస్యముగానైననూ విజయవంతము అగును.

కృత్తిక వారు కెంపు, పచ్చయు - రోహిణివారు ముత్యము - మృగశిరవారు పగడము ధరించుట మేలు.

ఈ రాశివారి అదృష్ట సంఖ్య 6. 3,4,5,8 సంఖ్యలు తేదీలతో కలసి వచ్చు బుధ, శనివారములు యోగప్రదములు.

శని, శుక్రవార నియములు - శనీశ్వరునికి తైలాభిషేకము - సుబ్రహ్మణ్యేశ్వర ఆరాధన, శుక్రజపములు యోగప్రదములు.

స్త్రీలు-మంగళ, శనివార నియమములు, దుర్గా, సుబ్రహ్మణ్య ఆరాధనలు చేయుట వలన సత్సంతానం, గ్రహశాంతి, గృహశాంతి కలుగును.

## మిథునరాశి

(మృగశిర 3,4 పాదములు, ఆరుద్ర 1,2,3,4 పాదములు, పునర్వసు 1,2,3 పాదములు)

ఆదాయం: 14 వ్యయం: 2 రాజపూజ్యం: 4 అవమానం: 3

ఈ రాశివార్కి గురుడు ఉగాది నుండి 99 జనవరి 12 వరకు 9ట లోహమూర్తి. తదాది వత్సరాంతం వరకు 10ట సువర్ణమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు 10ట లోహమూర్తి. తదాది వత్సరాంతం వరకు 11ట తామ్రమూర్తి. వత్సరాది నుండి 99 జనవరి 11 వరకు రాహువు 3ట, కేతువు 9ట లోహమూర్తులు. తదాది వత్సరాంతం రాహువు 2ట, కేతువు 8ట లోహమూర్తులు.

ఈ రాశివార్కి గురుడు యోగప్రదుడు. భాగ్యమందు వుండుటచే శుభకార్యసిద్ధి. భూగృహ నిర్మాణ లాభములు, భవిష్యత్‌కు ఉపకరించు బాటలు, విదేశీ ఉద్యోగ లాభములు, వ్యాపార వ్యవహార లాభములు, సంతాన ప్రాప్తిని, లక్ష్మీ వృద్ధిని కల్గించును. సంవత్సరాంతమున కూడా శుభముల మూలకముగా అధిక ధనవ్యయము కల్గును. ఇతరులకు ధైర్యము చెప్పచూ సాంఘీక కార్యములందు పాల్గొనుట చేయుదురు.

రాహు ప్రభావముచే 98వ సంవత్సరం ఆర్థికవృద్ధి, ఉన్నత వ్యక్తులతో పరిచయము, భూమి గురించిన వ్యవహార భయము, స్థిరాస్తులు వృద్ధి చేయుట మున్నగు ఫలితములుండును. 99 జనవరి నుండి అష్టమ కేతు ప్రభావముచే ఇతరులతో వితండవాదము, మోకాలు నొప్పులు, అజీర్తితత్వము కల్గుచుండును. శనిగ్రహ ప్రభావముచే శ్రమ, ధనవ్యయములు కల్గుచున్ననూ లెక్కచేయక తిరుగుచూ ఆశించిన దానికంటె తక్కువగానైననూ సత్ఫలితముల నొందుట.

గత 2-3 సంIIరముల కంటె చాలా విశేషమయిన సంతృప్తిని పొందుదురు. స్త్రీ సంతాన సౌఖ్యము, గతంలో నిలచిన వ్యవహారముల సఫలత పొందెదరు.

విద్యార్థులకు ఉన్నత విద్యాయోగములు కలవు. సైన్సు, న్యాయవాద సాంకేతిక విద్యార్థులకు అధికశ్రమ అవసరము. వ్యవసాయదారులకు సంIIర పూర్వార్థము మేలు. విలువలు కలసి వచ్చును. కంట్రాక్టులు, జాయింటులు విదానించిన మేలు.

సినిమా వృత్తివార్కి విశేష లాభములు, గుర్తింపు గల్గును. ఇంజనీర్లు, రైస్‌మిల్లర్లు, న్యాయవాద వృత్తుల వార్కి సంIIర పూర్వార్థము మేలు. కిరాణా, ఆపరములు, ఫ్యాన్సీ, కలప, రసాయన వ్యాపారులకు 7,8,12,1 మాసములు అనుకూలించవు.

3,4 మాసములందు పితృమూలక లాభము, ఆర్థిక లాభము, దైవకార్యాచరణలకై ధనవ్యయము. 5,6 మాసములందు చిత్రలేఖనం, దాతృత్వము, పరస్త్రీ వాంఛ, సుందర దేహచ్ఛాయ, రోగభయము. 7,8 మాసములందు కార్యవిఘ్నములు.

స్వల్ప ఆయాసము, అనారోగ్యము, ప్రయాణములు కల్గుచుండును. 9,10 మాసములందు శని గురుల వక్రముచే యత్నకార్యభంగములు. కార్యనిలబాటు, తలవని తలంపుగ ధన వ్యయము, ప్రయాణములు. 11,12 మాసములు బహు శతృభీతి, ఇతరుల నొప్పించక ఫలితము నొందుట, చేసిన వ్యయములో కొంచెము వృధా అగుట, వ్యవహార, గౌరవమునకై ప్రాకులాడుట. శాంతించిన కార్యలాభము కల్గుచుండును, మిగిలిన మాసములందు శృంగారాభిలాషణము, ఇంద్రియ నిర్వీర్యత, సుందర దేహఛాయ, ఆనందం, వ్యయసాయం, క్షేత్రలాభము, శుభకార్య లాభము, స్త్రీమూలక ధనలాభము. మొత్తంమీద ఈ రాశివార్కి యత్నకార్యసిద్ధి, శుభకార్యా చరణములు సిద్ధి, భూగృహ లాభములు కలసి వచ్చును. 5,6,9,11,12 మాసములు బహు నిదానము అవసరము. వ్యాపారస్తులు పెట్టుబడులు తగ్గించుట మేలు.

మృగశిరవారు పుష్యరాగాభరణం-ఆర్ద్రవారు గోమేధిక, నవరత్నములు-పునర్వసువారు ఎమరాల్డ్, పుష్యరాగాభరణాలు ధరించిన ఉత్సాహము, అభివృద్ధి కల్గును.

వీరి అదృష్ట సంఖ్య **5.** 1,3,8 సంఖ్యలు తేదీలుతో కలసి వచ్చిన ఆదిత్య, బుధ, గురు వారములు మరింత యోగప్రదములు.

స్త్రీలు గురువార నియమములు చేయుట వలన, విష్ణు లక్ష్మి స్తోత్రములు చేయుట వలన సత్సంతాన ప్రాప్తి, కుటుంబమున వృద్ధి, శాంతి, ఋణవిముక్తి, భర్తృసౌఖ్యము నొందుదురు.

## కర్కాటకరాశి

(పునర్వసు 4వ పాదము, పుష్యమి 1,2,3,4 పాదములు, ఆశ్లేష 1,2,3,4 పాదములు)

ఆదాయం: 8 వ్యయం: 2 రాజపూజ్యం: 7 అవమానం: 3

ఈ రాశివార్కి గురుడు 99 జనవరి 12 వరకు 8ట సువర్ణమూర్తి. తదాది వత్సరాంతం 9ట రజితమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు 9ట రజితమూర్తి. తదాది వత్సరాంతం వరకు 10ట సువర్ణమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 2ట కేతువు 8ట తామ్రమూర్తులు. తదాది వత్సరాంతమంతయు రాహువు జన్మమందు కేతువు 7ట సువర్ణమూర్తులు.

ఈరాశివార్కి గురుడు అష్టమస్థానమందు కష్టనష్టప్రదుడు. శ్రమకారి, ద్వేషి అయిననూ మూర్తిమంతము రీత్యా విశేషముగ యోగించును. అనుభవముతోను పరిశ్రమతోను భవిష్యత్ బాటలు వేయుచు, కుటుంబ గౌరవాదులకై ప్రాకులాడుట, గృహ నిర్మాణ, వివాహ శుభకార్యాదులందు పాల్గొనుట, ఇతరులకు అండగా వుండి కార్యక్రమములను నెరవేర్పించుట, కుటుంబ భారమును మోయుచు ధనవ్యయమును చేయుచుండుట మున్నగు లక్షణములు కల్గించును.

విద్యార్థులు ఇతరుల సహాయము కోరవలసి వచ్చును. గణితము, సాహిత్య భాషా విద్యార్థులకు భవిష్యత్తులో రాణింపు రాగలకాలము. న్యాయవాద, ఇంజనీరింగు విద్యార్థులకు విశేషకాలము.

ఉపాధ్యాయులు, బ్యాంకర్లు, ఆర్థిక సంబంధిత ఉద్యోగులకు - మిశ్రమ ఫలితములు సినీ కళాకారులు, స్వతంత్ర వృత్తుల వారికి భవిష్యత్తున యోగదాయకము. వ్యవసాయదారులు, నిలువదారులకు శ్రమ మిగులును.

కంట్రాక్టర్లకు ధనము పరహస్తమగును. బహుపరాక్! మీరు చేయు వ్యాపారము నందు అన్ని రంగములా ఆదాయములు కలిగివున్ననూ అన్ని విధములా పెట్టుబడులు పెట్టవలసి వచ్చును.

మత్స్య పరిశ్రమలు, కంట్రాక్టర్లు, షేర్లు, ఆర్థిక వ్యాపారులకు శతృత్వముల నెదుర్కొనవలసి వచ్చును. పెట్టుబడులు తగ్గించుట మేలు.

వస్త్రములు, ఫైనాన్సు, సిమెంటు, ఇనుము, ఇతర లోహములు - రాజకీయ వ్యాపారులకు 4,7,9,12,2 నెలలు తప్ప మిగిలిన మాసములు అభివృద్ధి దాయకములు.

4,5 మాసములందు - కుజుడు వ్యవహార సంప్రదాయములు, సన్మాన గౌరవములు, భూపశు లాభములు, సేవకత్వము, వ్యవహార కుశలత - దుర్బుద్ధిరీత్యా వ్యయం కలిగించును. 6వ మాసమునందు - వ్యాపార పెట్టుబడులు, శుభకార్య - అలంకార వస్తువుల నిమిత్తం ధనవ్యయము, నేత్ర అనారోగ్యం - శిరోవేదన.

7,8 మాసాలలో వ్యవహార తొందర, ఆశాభంగం, ఎజుపు వలన భీతి, బుద్ధిమందత, భోగము.

9వ నెలలో పరాక్రమం, శత్రుమిత్రత్వము, పుణ్యయాత్రా సిద్ధి, వివాహ వ్యవహార జయములు. అధికార యోగం, ఆత్మబంధు సుఖం-కాని, లేకితనం. 10వ నెలలో మాతృవర్గ అవరోధము, అకాలభోజనములు, ఈ సమయమున శని గురుల వక్రముచే అనివార్య కార్యనిమగ్నత సృజించును.

11,12 మాసములందు పాదములు, ఉదర, లింగసూచిత స్థానములందు ఆరోగ్య లోపములు. తరచు అనుమానములు, భయము, కలుగుచున్ననూ, అంగారక ప్రభావముచే కొంత శాంతి. మిగిలిన మాసములందు సంతాన సౌఖ్యము, వృద్ధి, విరతాన్నదానము, వివాహాది శుభకార్యాచరణములు, భూగృహ నిర్మాణములు, లాభములు, యత్నస్థాన బదిలీలు.

పునర్వసువారు ముత్యం పుష్యరాగములను-పుష్యమివారు కెంపూ, మయూర నీలములను-ఆశ్లేషవారు పచ్చ, కనకపుష్యరాగములను ధరించుట యోగదాయకము.

మొత్తము మీద ఈరాశివారికి సంవత్సర మధ్యమందు ఒడిదుడుకులు, మాట తొందర, ఆరోగ్య అసౌఖ్యం కలుగుచున్ననూ - సంవత్సరాంతమున కొన్ని ఇబ్బందులు కలుగుచున్ననూ, వ్యవహారములు ఎప్పటికప్పుడు దూరదృష్టితో బాధ్యతతో పరిష్కరించుట మేలు.

వీరి అదృష్ట సంఖ్య **2.** 1,7,8,9 సంఖ్యలు తేదీలుతో కలసివచ్చు ఆదిత్య భౌమ శుక్ర వారములు యోగప్రదములు. గ్రహశాంతికై గురువార నియమములు, కాలసర్పయోగ, దోష నివారణకై తఱచు సుబ్రహ్మణ్య అభిషేకములు, అంజనేయ స్తోత్రములు, ఈశ్వరాభిషేకములు, విష్ణుసహస్ర స్తోత్రములు ఉత్తమము.

స్త్రీలు మంగళ, గురువార నియమములు, సుబ్రహ్మణ్య, దుర్గ, బాలాజీ పూజలు జరిపించిన (గర్భిణులకు సుఖప్రసవము) కుటుంబమందు ఋణవిమోచన, భర్తృ పుత్ర సౌఖ్యములు, శాంతి పొందగలరు.

## సింహరాశి

**(మఖ 1,2,3,4 పాదములు, పుబ్బ 1,2,3,4 పాదములు, ఉత్తర 1వ పాదము)**

ఆదాయం: 11 వ్యయం: 11 రాజపూజ్యం: 3 అవమానం: 6

ఈ రాశివార్కి 99 జనవరి 12 వరకు 7ట గురుడు తామ్రమూర్తి. తదాది వత్సరమంతయు 8ట లోహమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు 8ట సువర్ణమూర్తి. తదాది వత్సరమంతయు 9ట రజితమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు జన్మమందును కేతువు 7ట సువర్ణమూర్తులు. తదాది వత్సరమంతయు రాహువు 12ట, కేతువు 6ట తామ్రమూర్తులు.

ఈ రాశివారికి గత 4-5 సంవత్సరములుగా ఉన్న శనిదోషము తొలగుటచే దోషభారము తగ్గి. క్రమముగా శాంతినీ వృద్ధినీ కలిగించును. శని మూర్తిమంతయు చేత కష్టములనుండి కడతేర్చును. శుభముల నిచ్చును. జన్మమునకు శుభ గురు వీక్షణచే ఎంతటి సమస్యలైననూ శాంతముగా పరిష్కరించుట, ఇతరుల సహకారము వలన ప్రయత్నములు జరుగును. ఇంకనూ శుభమూలక ధనవ్యయం, చేయు కృషియందు భవిష్యత్తులో లాభములు కల్గును. ఇతరుల వ్యవహారములందు తలదూర్చరాదు. సంవత్సరాంత మందు 3ట అంగారక ప్రభావముచే ఆరోగ్య లాభము సంతానాది విద్యావ్యాపార ఉద్యోగ విజయములు కలిసివచ్చును.

ఉద్యోగులు ఆకస్మికదాడులు, అన్నివర్గముల వారిచేతా మనస్తాపములు ఎదుర్కొందురు. వీరి మాటలకు ప్రాధాన్యము కలుగును. విద్యార్థులకు అత్యధిక శ్రద్ధ ఉన్ననేగాని ఉత్తీర్ణులు కాలేరు. భాషేతర విద్యార్థులకు మిశ్రమ ఫలితములు. వ్యాపారులకు తాత్కాలిక చిన్న పెట్టుబడులు బాగుగా కలసివచ్చును.

సినిమా, కవులు, భాషాకోవిదులకు గుర్తింపు రాగలకాలము. వీరికి ఉన్నతాధి కారుల ద్వారా ప్రశంసలు, గుర్తింపు కలుగును. మొత్తము మీద అన్ని రకముల వ్యాపారులకు, పట్టినదల్లా బంగారము. ఊహాలోక విహారము, పెద్ద పెద్ద వ్యాపారములపై దృష్టి ఆశ్చర్యకర సంఘటనలు, లేనిది వున్నట్లు నటించుట అతి శీఘ్ర కార్యనిర్వహణ మొదలగు ఫలితాలు సూచింపబడినప్పటికీ మూలమును గతమును దృష్టిలో నుంచుకుని, శక్తికి మించక సంచరించినచో సర్వవిధములా శుభమగును.

మత్స్యములు, ఫైనాన్సు వ్యాపారులకు యోగకాలము కాదు. సాంకేతిక వ్యాపారులు, కంట్రాక్టర్లు, కోళ్లఫారముల వ్యాపారులు, రైస్‌మిల్లర్లు సంవత్సర ప్రారంభ అంత్యములందు అభివృద్ధి పథములో నడుచుదురు. వ్యవసాయ దారులకు శ్రమ మిగులును. గృహ నిర్మాణములు, పెట్టుబడులు, శుభయత్నములు, దూరదృష్టితో నిలబాటుచేసి జరిపించుట శ్రేయస్కరము.

4-5-6 నెలలందు నిర్మలము కాని ఏకాగ్రత, జపతపవాంఛ, సోదర క్లేశ సానుభూతి, ఉద్యోగలాభం, సాంఘిక కార్యముల ద్వారా గౌరవ సన్మానములు, మాతృవర్గ అష్టబలం-అయిననూ మంచికాలము. 7,8 మాసము లందు వాక్పటుత్వము, ఎటువంటి సమస్యనించియైనా తెలివిగా తప్పించుకొనుటకు ప్రయత్నించుట, వస్త్రలాభము, వాహన సౌఖ్యము, కవితా వ్యాసంగం, చతుర సంభాషణం, కళాప్రియత్వం మొదలగు ఫలితములు కలుగును.

9,10,11,12 మాసములలో నీచస్త్రీ వైరం, వాహన భయం, మంచి గురించి వాదులాటలు - వ్యయము, శస్త్ర చికిత్స సూచనలు, ఔషధ సేవ, ప్రయాణములలో జాగ్రత్తలు మొ॥గు ఫలితములుండును. గ్రహశాంతి అవసరము.

సంవత్సరాంతమందు యత్నకార్యసిద్ధి, అయత్న లాభములు, శుభకార్య నిర్వహణములు, వ్యవహార జయములు, మానసిక ప్రశాంతత, సర్వే సర్వత్రా సుఖ శాంతులూ కలిగి శుభమయముగా నుండును.

మఖవారికి వైఢూర్యము, పగడములను-పుబ్బవారికి వైదూర్యమును - ఉత్తర వారికి కెంపు, జాతి పచ్చలను - ధరించుట వలన ధనలాభం, ఆరోగ్యలాభం, కుటుంబ లాభములు కలుగును.

వీరి అదృష్ట సంఖ్య **1.** 2,3,5,9 ఆది మంగళ బుధ శుక్ర వారాలతో కలిసిన మరింత యోగ్యప్రదములు.

గ్రహశాంతి కొరకు గురు రాహు కేతువులకు జపశాంతులు, దుర్గాపూజలు, సుబ్రహ్మణ్య అభిషేకములు, గురువార నియమములు చేయవలెను.

స్త్రీలు గణేశ్వర - నవదుర్గారాధనలు చేయుటవలన మనశ్శాంతి, కుటుంబ మందు సుఖశాంతులు కలుగును.

## కన్యారాశి

### (ఉత్తర 2,3,4 పాదములు, హస్త 1,2,3,4 పాదములు, చిత్త 1,2 పాదములు)

ఆదాయం: 14 వ్యయం: 2 　　　　　　　　రాజపూజ్యం: 6 అవమానం: 6

ఈ రాశివార్కి గురుడు 99 జనవరి 12 వరకు 6ట రజితమూర్తి. తదాది 7ట సువర్ణమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు 7ట రజితమూర్తి. తదాది 8ట సువర్ణమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 12ట, కేతువు 6ట రజితమూర్తులు. తదాది వత్సరాంతం వరకు రాహువు 11ట, కేతువు 5ట రజిత మూర్తులు.

ఈ రాశివార్కి గురుడు షష్ట స్థానమందు పాపి, శని అష్టమమందు పాపి. రాహువు 12ట పాపి. ఈ 3 గ్రహములకు స్థానబలము లేకున్నది గాని, మూర్తి మంతములచే చాలావరకు అపకారమును జరుగనివ్వరనియే భావించవలెను. అనేక ఈతిబాధలు, వ్యయము కల్గించుచున్ననూ చివరకు మేలే చేయుదురు. ధనము నిలువకున్ననూ లోటురాదు. సప్తమ శని షష్ట గురుల ప్రభావముచే పితృవర్గానికి అనారోగ్యము. పుత్ర సంతానము గురించి ఆరాటము, మేనమామ వర్గరీత్యా అపకారము, గృహ అసౌఖ్యం, స్థిరాస్తుల నుంచి విదానం, ఒంటరి జీవితాభి లాషణము, నల్లని జంతుభీతి, అపవాదములు, మొదలగు ఫలితములుండును.

4,5 నెలలు కలసిరావు. ఇతరుల వ్యవహారములో జోక్యము చేసుకొనుట వలన అగౌరవము కలుగును. కొంతవరకూ స్త్రీ సహాయము కలిగిననూ - కష్టకాలమని చెప్పక తప్పదు. 6,7 నెలలు క్రమక్రమాభివృద్ధి, వ్యవహార విజయము, ఆస్తుల కొనుగోలు, ప్రియ సంభాషణ, సుఖశయనము వంటి శుభ సూచనలు కలవు.

8,9 మాసములు యోగప్రదము. ఉత్తరార్థము ఉద్యోగ పదవీ వివాహ నూతన వస్తువస్త్ర సువర్ణస్త్రీలాభములు - శుభకార్యాచరణలు - 10,11 నెలలు అధికవ్యయం, అనారోగ్యం, ఆందోళనలుండును. 12,1 నెలలలో స్థానచలన సూచనలున్ననూ బంధుమిత్ర సహకారం లభించును. జనవరిలో గురుడు సప్తమ స్థానమున ప్రవేశించుటచే అనేక చిక్కుల నుండి రవంత బైటపడి, అంతయు శుభముగా కనుపించును.

వివాహ వ్యవహారములు నిలబాటు చేసి, సంవత్సరాంతమునకు ఉపక్రమించిన యోగవంతములగును. సంవత్సరాంత మున ఉద్యోగ విజయములు, వ్యాపార, భూగృహ నిర్మాణ లాభములు పొందుదురు. జాయింటు వ్యాపారములు కలసిరావు. వ్యవసాయము మధ్యమ ఫలితము. యాంత్రిక వ్యాపార నిర్మాణములు సంవత్సరాంతమున మేలు.

విద్యార్థులకు అధికశ్రమ, అత్యధిక శ్రద్ధ కలిగిన గాని ఉత్తీర్ణులు కాలేరు. సెప్టెంబరు ఛాన్సు చూడవలసి వచ్చును. వీరు గణపతి, దక్షిణామూర్తి ఆరాధనలు చేయుటవలన మేధాశక్తి, విద్యాసక్తి పొందుదురు.

విదేశీ ఉద్యోగ అభిలాషులకు ఆశాభంగము. అన్ని రంగముల అధికారులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు 4,5,8,9, 12,1 మాసములు ఆకస్మిక తనిఖీలనూ, సామాన్యుల వలన ఇబ్బందులనూ ఎదుర్కొనవలసి వచ్చును.

రాజకీయములు యోగించవు, వైద్యులకు, స్వతంత్ర వృత్తులవారికి మిశ్రమ ఫలితములు. ఫైనాన్సు, వస్త్ర, లోహ, మత్స్య వ్యాపారులకు 4,10,11,12 తప్ప, మిగిలిన మాసములు అంతగా కలిసిరావు. వ్యాపారులకు తక్కువ పెట్టుబడులతో నామకః వ్యాపారము చేయుట మంచిది.

కవులు, కళాకారులు, సినిమావాళ్లకు - ప్రజా విమర్శలు పొందవలసి వచ్చును. రైస్ మిల్లర్సు, న్యాయవాద వృత్తివారు, వ్యాపారులకు ఆగష్టునుండి నవంబరు వరకు అనుకూలము కాదు. జాయింటులు, భారీ పెట్టుబడులు, నిలవలు కలిసిరావు. తగ్గించుట మేలు.

ఉత్తరవారు కెంపును - హస్తవారు ముత్యము పుష్యరాగములను - చిత్తవారు పగడమును - ధరించుట యోగప్రదము. వీరి అదృష్ట సంఖ్య **5.** 1,6,3,7 సంఖ్యలు, తేదీలుతో కలసివచ్చు ఆది బుధ గురు శుక్ర వారములు అనంత యోగఫలదములు.

ముఖ్యముగా ఈ రాశివారికి నవగ్రహ ఆరాధనములు, మృత్యుంజయ జపములు, చండీ ప్రదక్షిణ, రుద్రాభిషేకములు చేయుట చాలా మేలు.

స్త్రీలు గురువార నియమములు, లక్ష్మీ - లలితా స్తోత్రములు, చంద్రశేఖరాష్టకములు పఠించుటచే గృహమందు శాంతి సౌఖ్యములు, భర్తకు స్థిరత్వము, ధనవృద్ధి, కుటుంబ వృద్ధి కలుగును.

## తులారాశి

(చిత్త 3,4 పాదములు, స్వాతి 1,2,3,4 పాదములు, విశాఖ 1,2,3 పాదములు)

ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 2 అవమానం: 2

**ఈ రాశివార్కి 1999 జనవరి 12 వరకు గురుడు 5ట లోహమూర్తి. తదాది వత్సరమంతయు 6ట రజితమూర్తి. ఏప్రిల్ 17 వరకు శని 6ట లోహమూర్తి. తదాది వత్సరమంతయు 7ట తామ్రమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 11ట, కేతువు 5ట లోహమూర్తులు. తదాది వత్సరమంతయు రాహువు 10ట, కేతువు 4ట లోహమూర్తులు.**

ఈ రాశివారికి నైసర్గిక శుభగ్రహమైన గురుడు వత్సరాది నుండి 5ట, జనవరి నుండి 6ట స్థానాదిపత్య మూర్తి మంతాదుల వలన దోషియగుటచే సుమారుగా యోగప్రదుడు. సంవత్సరాంతమందు దోషి, శని ప్రారంభమందు యోగదాయకుడు. తరువాత మిశ్రమ ఫలదుడు. రాహు కేతువులు మిశ్రమ యోగప్రదులు. వీరికి గతములోని మానసిక, ఆర్థిక వ్యవహార పరిస్థితులు ఈ సంవత్సరమున కూడా వర్తించును.

సంవత్సర ఉత్తరార్ధమున అంగారక ప్రభావముచే తరచు బహుధన వ్యయము, ఆశించిన దానికన్నా తక్కువ ఫలితము పొందుట, చోర - శత్రుభయము, లాభమునందు ఆటంకము, ఉష్ణబాధ, స్త్రీ వైరం, శస్త్రచికిత్స, వ్యాపార వ్యవహార భంగములు, కుటుంబమందు ఏదో ఒక అస్థిమితము, వ్యాపారములలో మార్పు చేయవలసి యుండును. కోర్టు వ్యవహారములు సంవత్సర పూర్వార్ధమున విజయము కలుగును.

కాంట్రాక్టర్లకు రాజకీయవేత్తలకు విశేషమైన కాలము. విద్యా ఉద్యోగములకై దూర దేశములకు ప్రయాణాసక్తి కలవారలకు యోగించు కాలము. స్వతంత్ర వృత్తుల వారికి, వ్యాపారులకు విశేష ఫలితములు కలుగును. దైవకార్యాచరణ, మంత్రసిద్ధి ఫలించును.

4,5 మాసములందు పత్నీ అసౌఖ్యము, ఏదో ఒక అనారోగ్యము, విలాసము, అపవాదములు, వితండవాదములు, కవులు, కళాకారులకు ఆదాయ గౌరవములు.

6,7 మాసములలో శుభకార్యసిద్ధి, వ్యవహార లాభం, ధన సమృద్ధి, కృషియందు నిమగ్నత, దాసదాసీ సుఖం, సన్మిత్ర లాభం, శతాయుః ఖ్యాతి, సర్వదా ఆనందం, ఆభరణ ప్రాప్తి.

8,9 నెలలలో ఉద్యోగ ఉన్నతి, సమర్థత, వాక్చాతుర్యం, ప్రభుత్వ ప్రశంసలు కలుగును. సంతానారోగ్యం గురించి జాగ్రత్తలు అవసరము.

10,11 నెలలలో మనో ఆనందము, సాధుసంగ ప్రియత్వము, భోగము, స్త్రీ వాంఛ, నూతన వస్తు వస్త్రధారణా లాభము, తరచు శుభమూలక ఆర్థిక వ్యయములు, వ్యాపార మార్పు చేర్పులు జరుగును.

విద్యార్థులకు సంవత్సర పూర్వార్ధము ఉన్నతి కలిగినా, సంవత్సరాంత మందు బహు కృషి అవసరము. సైన్సు, కామర్సు, గణిత శాఖలవారికి పరివర్తనలు కలుగును.

వ్యవసాయదారులకు గతముకంటె మేలు. కంట్రాక్టులు, జాయింట్లు, విలువలు, స్పెక్యులేషనులు, షేర్లు - యోగించును. రాజకీయ ఉన్నతి. ఫైనాన్సు, కలప, ధాన్యము, సినిమా, మత్స్య పరిశ్రమల వారికి 4,6,8,9,1 మాసములు యోగించవు. వైద్య, జ్యోతిష ఇతర వృత్తుల వారికి పూర్వఖండము మెరుగు.

చిత్తవారు పగడము, ముత్యములను - స్వాతివారు గోమేధికము, వజ్రములనూ - విశాఖవారు పుష్యరాగ నీలములను - ధరించుట శుభప్రదము.

వీరి అదృష్ట సంఖ్య 6. 4,5,8 సంఖ్యలు, తేదీలతో కలసివచ్చిన ఆది, బుధ, శుక్ర, శనివారములు కలసిన మరింత యోగప్రదముగా నుండును.

ఈ రాశివారు శనీశ్వరునకు తైలాభిషేకములు, సుందరకాండ పారాయణ, లక్ష్మీ గణపతి స్తోత్రములు చేయుట విశేష సౌఖ్యదాయకం.

**స్త్రీలు సంవత్సర పూర్వార్ధమున శుక్ర శనివార నియమములు, ఉత్తరార్ధమున మంగళ శనివార నియమములు చేయుట మంచిది. సంవత్సరమంతయూ శ్రీ కృష్ణ పూజలూ, కుజ గురు గ్రహ స్తోత్రములు చేయుట శ్రేయస్కరము.**

# వృశ్చికరాశి

(విశాఖ 4వ పాదము, అనూరాధ 1,2,3,4 పాదములు, జ్యేష్ఠ 1,2,3,4 పాదములు)

ఆదాయం: 2 వ్యయం: 14 రాజపూజ్యం: 5 అవమానం: 2

ఈ రాశివార్కి గురుడు 1999 జనవరి 12 వరకు 4ట తామ్రమూర్తి. తరువాత వత్సరమంతయు 5ట రజతమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు 5ట సువర్ణ మూర్తి. తదాది 6ట రజితమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 10ట, కేతువు 4ట సువర్ణమూర్తులు. తదాది రాహువు 9ట, కేతువు 3ట లోహమూర్తులు.

వీరికి గురుడు సంవత్సర ప్రారంభాంత్యములందు యోగప్రదుడు. సంవత్సర మధ్యయందు వక్రముచేత కుటుంబమందు మనస్తాపము, సంతాన ఆరోగ్య లోపములు, ఆరోగ్య వ్యవహార శుభకార్య దైవకార్యముల రీత్యా విరివిగా ధనవ్యయము కలిగించును. శనియోగ కారకుడు. శుభకార్య సిద్ధి, వృద్ధి కలిగించును. చిరకాలమునుండి నిలిచిన వ్యవహార, వ్యాపార లావాదేవీలు, కుటుంబ వివాదములు మొదలగునవన్నియు క్రమముగా సుగమము చేయును.

రాహు కేతువులు మిశ్రమ ఫలప్రదులు. మాట పట్టింపులు, తాత్కాలిక కార్య భంగములు కల్గించుటలో శ్రేష్ఠులు. గాని, వ్యవహారములను గురించిన మౌనము, నిష్కల్మషము, దాతృత్వము ప్రదర్శించిన - కీర్తిప్రతిష్టలు పెరుగును. దైవక్షేత్ర సందర్శనములు, సంఘమునందు ఉన్నత పదవినలంకరించుటలో సమర్థులు, వీరు ఏ పనిచేసిననూ పైకి కన్పించరు. సంవత్సరాంతమున యాంత్రిక వ్యాపార నూతన నిర్మాణములు ప్రారంభము చేసిన చాలా యోగదాయకముగా నుండును.

టెక్నాలజీ విద్యార్థులకు విశేష కాలము. గణితము, ఆంగ్లము, భాషేతర విద్యార్థులకు పునశ్చరణము చేయవలసి యుండును. రసాయనిక, న్యాయవాద విద్యార్థులకు అధికశ్రద్ధ అవసరము. లెక్చరర్లు, డాక్టర్లు, జ్యోతిషవేత్తలకు మాత్రము మిశ్రమ ఫలితములు.

వ్యవసాయదారులకు కలిసివచ్చును. ఎరువులు, కలప, ఇనుము, యంత్ర, తైల, సినిమా వ్యాపారస్థులకు విశేషకాలము, రాజకీయము కలసిరాదు.

కాంట్రాక్టులు, గృహ నిర్మాణ సంస్థలు, స్థిర వ్యాపారములు, ఎలక్ట్రానిక్ యంత్ర పరిశ్రమలు, ఫైనాన్స్ వ్యాపారములు విశేషముగా కలిసివచ్చును. ప్రతీ పనినీ వీరు పుత్రసహకారముతో మాత్రమే చేయగలుగుదురు.

4,5 మాసములందు శతృవ్యయం, మిత్ర అధికారుల వలన - గృహరీత్యానూ ధనవ్యయము, భూగృహ క్రయ విక్రయ లాభములు, ఒకప్పుడు స్వల్ప విరోధములు కలుగుచుండును. గృహాలంకరణకు కాలము వినియోగింతురు.

6,7 మాసములందు శక్తికి మించిన శ్రమ, స్వల్ప చోరభయము, రాజాధికార మిత్రప్రాప్తి, ప్రారంభమున అసౌఖ్యము, తరువాత సుఖము. 7,8 మాసములందు ఇతరులచే స్తుతింపబడుట, తరచు ఆలోచనలు, బంధు సుఖం. 9,10 నెలలలో తరచు మాట్లాడుచుండుట, దీనత్వము ప్రదర్శించుట, స్వయంకృషితోనూ - తలవని తలంపుగానూ ధనలబ్ధి, ఉత్తమ భోజనం. 10వ నెలలో తపోధర్మ కార్యసిద్ధి, సంఘగౌరవం, సోదరసౌఖ్యం - కాని ద్వేషం, వాతావరణ పరిస్థితులచే మిశ్రమ ఫలితములు. 11వ నెలలో క్షీరాన్న భోజనము, సౌందర్య అలంకారము, ఆనంద హృదయము. 12వ నెల శతృవృద్ధి మూలకంగా ధనలాభం, స్వల్ప అనుకూలత. 1వ నెల వ్యాధిభయం, ఔషధ సేవలు, క్రయ విక్రయములకు కాలము వెచ్చించుట, 2వ నెల మానసిక ఆందోళన, ఒంటరి జీవితాభిలాష, శారీరక అసౌఖ్యం.

విశాఖవారు పుష్యరాగాభరణము - అనూరాధవారు నీలము, వజ్రములను - జ్యేష్ఠ వారు కెంపును పచ్చయును ధరించుటచే యోగించును.

వీరి అదృష్ట సంఖ్య 9. 1, 2, 3, 7 సంఖ్యలు తేదీలతో కూడిన ఆది, సోమ, గురు వారములలో యోగించును.

ఈ రాశివారు కుజ గురు రాహు కేతు జపములు, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి పూజలు, విష్ణు సహస్రం, శివలింగ దర్శనములు చేయుట వలన గ్రహదోషములు తొలగి శుభములు సమకూడును.

స్త్రీలు దుర్గాపూజలు, సుబ్రహ్మణ్యేశ్వర పూజలు, లలితా లక్ష్మీ సహస్రములు, గురువార నియమములు పాటించుటచే పుత్ర సంతానము వలన సుఖము, స్వగృహ నిర్మాణము, స్వకుటుంబ శాంతి, సౌఖ్యములు కలుగును.

## ధనూరాశి

(మూల 1,2,3,4 పాదములు, పూ.షా. 1,2,3,4 పాదములు, ఉ.షా. 1వ పాదము)

ఆదాయం: 5 వ్యయం: 5 రాజపూజ్యం: 1 అవమానం: 5

ఈ రాశివార్కి గురుడు 1999 జనవరి 12వ తేదీ వరకు 3ట సువర్ణ మూర్తి. తరువాత వత్సరాంతము 4ట లోహమూర్తి. శని ఏప్రియల్ 17 వరకు 4ట రజతమూర్తి. తర్వాత వత్సరాంతం 5ట సువర్ణమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 9ట, కేతువు 3ట రజతమూర్తులు. తదాది రాహువు 8ట, కేతువు 2ట సువర్ణమూర్తులు.

వీరికి సంవత్సరమంతయు శని 5ట పరిపూర్ణ యోగ్రపదుడు. నీచస్థానమందున్ననూ మూర్తిమంతము రీత్యా బాగుండుటచే ఎటువంటి క్లిష్ట పరిస్థితులనైననూ ఎదుర్కొనగలుగుదురు. పుత్రసంతానాదుల ఆరోగ్య విషయములో వైద్యరీత్యా ధనవ్యయము జరిగిననూ, రోగోపశాంతి కలుగుటచే మనః స్థిమితము ఏర్పడును. అయిననూ బంధువైరములు, కుటుంబకలహములు, మిత్రశతృత్వములు, జాయింటుల యందు చిక్కులు కలుగవచ్చును. ఒకప్పుడు సంఘమున గౌరవము పోగొట్టుకొనవలసి వచ్చిననూ, నాస్తిక క్రూర మనస్తత్వము కలిగిననూ, సంవత్సరాంతమందు 11ట అంగారక స్తంభనచేత వీరికి విశేష స్థిరయోగములనే కలిగించును. రాహు ప్రభావముచే కొద్ది ఆలస్యమైననూ వ్యవహార విజయములుండును. ఉద్యోగ వ్యాపారము లందు ఒడిదుడుకులూ, ప్రతిష్టంభనలూ తొలగి వృద్ధినొందుట కలుగును. చిరకాల బాకీలు వసూలగును.

విద్యార్థులకు యోగకాలము. న్యాయవాదులు, శాస్త్ర పండితులకు స్వల్ప ఫలితములు, కవి గాయకాది కళాకారులకూ, నటకులకూ సంవత్సర మధ్యమందు అనుకూలము కాదు.

కాంట్రాక్టర్లకు, వ్యవసాయదారులకు కృషికి తగిన ఫలితము లభించును. అపరములు, కిరాణా, ఫ్యాన్సీ వస్త్ర వ్యాపారులకు వృద్ధికరము. ఇనుము, నూతన నిర్మాణ యాంత్రిక వ్యాపారస్థులకు సంవత్సర మధ్యభాగము మంచిది కాదు.

విశేషముగా కలసివచ్చును. నిలువదారులు, ఇతర వ్యాపారులకు గతముకంటె నయముగా నుండును. కోళ్లఫారంలు, సుగంధ ద్రవ్య వ్యాపారులకు తాత్కాలికముగా బాగుండును. రాజకీయవాదులకు యోగ్యమైన కాలము కాదు. స్వయం వ్యాపారమే మేలు. స్పెక్యులేషన్ ఫలితములు మిశ్రమముగా ఉండును.

సంవత్సర ప్రారంభములో మనో నిర్మలత, క్షీరాన్న భోజనము, భూరత్నలాభము, భోగము, క్రయ విక్రయ లాభము కలుగును. 5,6 నెలలో ఆదిలో ధనవ్యయమూ, పాపకార్యాసక్తతా కలిగిననూ, స్వల్ప ఋణములు చేయవలసి వచ్చిననూ, చివరకు మంచిగానే ఉండును. 7,8 మాసములలో ప్రయాణ ధనలాభములు, వివాహ వ్యాపారాల రీత్యా విదేశయానం, స్త్రీ అపవాదు, ఉదర సంబంధ అనారోగ్యములు, వ్యాపార కుశలత, ఇతరులకై ధనము దుర్వ్యయము చేయుదురు.

నెల ప్రయాణ ధనలాభములు, ఊహాలోక విహారం, స్త్రీ సుఖప్రాప్తి, దుష్ట భాషణం, ఒంటరితనం. 10,11 మాసములు ఉన్నతాధికారుల మైత్రి, భూస్వర్ణ వస్త్ర అలంకారప్రాప్తి, స్వల్పజయం, గృహసౌఖ్యం, యత్నకార్యసిద్ధి. కొంచెము క్రూర మనస్తత్వముండును. సోదరులతో మౌనము మేలు. ఉద్యోగ వ్యాపారములలో నిదానించుట వలన లాభముండును. 11,12 నెలలలో నవంబరు 20 నుంచి, డిసెంబరు 18 వరకు నేత్ర, గాత్ర, పాదములందునూ, చర్మమునకునూ అనారోగ్య సూచనలు. తదుపరి సంవత్సరాతం వరకు అత్యధిక భాగం శ్రేయోదాయకం.

మొత్తము మీద ఈ రాశివార్కి సంవత్సరం స్వయం కృషి వలన అభివృద్ధి, దైవ వివాహాది శుభ కార్యాచరణలు, రాజకీయ లాభములు కలుగును.

మూలవారు వైఢూర్యము, పచ్చయును - పూర్వాషాఢ వారు వజ్రమును దానికంటె కెంపును - ఉత్తరాషాఢవారు కెంపునూ ధరించుట వలన యోగదాయకముగా నుండును.

వీరి అదృష్ట సంఖ్య **3.** 1,2,7,9 సంఖ్యలూ, తేదీలతో కలసివచ్చు ఆది, సోమ, గురువారములు యోగదాయకములు.

ఈ రాశివారు సూర్యనమస్కారములు, బగళాదేవి ఆరాధనలు, ఈశ్వర ఆరాధనలు, రుద్రాభిషేకములు చేయుట వలన యోగప్రదముగా ఉండును.

స్త్రీలు ఆది, గురు వార నియమములు చేయుట, దత్తాత్రేయ ఆరాధనలు, లక్ష్మీ పూజలు చేసుకొనుట వలన కుటుంబమందు శాంతి, సర్వతోముఖాభివృద్ధి సమకూరును.

## మకరరాశి

(ఉత్తరాషాఢ 2,3,4 పాదములు, శ్రవణం 1,2,3,4 పాదములు, ధనిష్ఠ 1,2 పాదములు)

ఆదాయం: 8 వ్యయం: 14 రాజపూజ్యం: 4 అవమానం: 5

ఈ రాశి వార్కి 99 జనవరి 12 వరకూ గురుడు 2ట రజితమూర్తి. తదాది సంవత్సరాతం 3ట సువర్ణమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు 3ట సువర్ణమూర్తి. తదాది 4ట లోహమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 8ట, కేతువు 2ట సువర్ణమూర్తులు. తదుపరి వత్సరమంతయు 7ట రాహువు, జన్మమందు కేతువు రజితమూర్తులు.

ఈ సంవత్సర మీరాశివార్కి శని అర్థాష్టమమందు పిత్రు ధనవ్యయమును, బంధు వైరమును, వాహన వ్యయమును సూచించును. కాని, లగ్నమునకు పరిపూర్ణ యోగప్రదుడు గాన, ఎంత అశాంతి కలిగించిననూ స్థాన సౌఖ్యమునూ, పట్టుదలతో కార్యసిద్ధినీ, కలిగించును. గురుబలము వలన విద్యాభిలాషులకు ఉన్నత విద్యకై దూరదేశములు వెళ్లుట జరిగిననూ అధిక ధన వ్యయము తప్పదు. శుభకార్య సిద్ధి కలిగిననూ ఆశించిన దానికి భిన్నమై సత్ఫలితము కలుగును. మొత్తము మీద శుభమూలక ధనవ్యయం, మతసంబంధ విషయములలో చురుకుగా పాల్గొనుట యుండును. తరచు నోటిపూత, కవితా వ్యాసంగము, ఆత్మీయ బంధులాభము, బాహు మనోబలం ఇత్యాది ఫలితములు ఉండును.

అన్నిరంగముల విద్యార్థులకు యోగకాలము. అట్లని బద్ధకించినచో విశేష అవయోగము కలుగును. కనీస కృషినైననూ చేయుట అవశ్యము.

కాంట్రాక్టర్లకు కాస్తలో కాస్త శుభము. మత్స్య పరిశ్రమలు, రైసుమిల్లుల వారికి మేలు. నిలువదారులకు, జాయింటు వారికి మిశ్రమ ఫలితములు ఉండును. రాజకీయ అధికారములు కలుగు అవకాశములు అధికము.

4,5,6 మాసములు ప్రారంభమున కొంత అసంతృప్తిగా వున్ననూ క్రమక్రమముగా రాజమిత్ర, అధికార ప్రాప్తి, పరోపకారం, గతంలోని సమస్తమైన కష్ట నిష్ఠూరాలనుంచీ మెల్లమెల్లగా కోలుకొనుట, భూరత్న వ్యవహార లాభం, మాతృసౌఖ్యం కలుగుతాయి. 7,8,9 నెలలలో స్త్రీ సుఖప్రాప్తి కలిగిననూ కోరికలతో అలమటించుట, అకాలమున మృష్టాన్న భోజనము, నిత్యమూ కార్య నిమగ్నత కల్గును. 10,11,12 నెలలలో స్వల్పరాజయోగము, శుభకార్య నిర్వహణోత్సాహము, ఉన్నత వర్గమిత్రలాభం, గౌరవ సన్మానాదులు కల్గును. ప్రారంభములో కృతఘ్నత, స్త్రీ అపవాదములు, అస్థిమితం, జపతప వాంఛ, కార్య సాఫల్యత కల్గును. 1,2 మాసములు ఆకస్మిక ధనలాభం, బంధుమిత్ర ప్రియత్వం, ఆడంబరాలకై వ్యయం. చివరలో చిరుకోపం, చికాకు, త్రిప్పట.

సంవత్సరాంతంలో అల్పాదాయం, అల్పదాతృత్వం, దీనత్వం, అయినా విశేష కార్యాలోచన, మనోల్లాసం, మోకాళ్లు - నేత్రాల ఆరోగ్య రీత్యా ధనవ్యయం. మొత్తం మీద ఈ సంవత్సరం స్వయం కృషితో శుభమయంగా ఉంటుంది. కృషి లోపించినచో తరచు అవమానములు, వైరాగ్యములు, మాలిన్యత, దైవకార్యాచరణలు తప్పవు.

ఉత్తరాషాఢ వారు కెంపును, పచ్చను - శ్రవణమువారు ముత్యమును, నీలమణిని - ధనిష్టవారు పగడము ధరించుట సర్వదా శ్రేయస్కరముగా నుండును.

**వీరి అదృష్ట సంఖ్య 8.** 3,5,6 సంఖ్యలు, తేదీలతో కలసివచ్చు బుధ, గురు, శుక్ర వారములు యోగప్రదములుగా వుండును.

శ్రీ రాజరాజేశ్వరీ అమ్మవారి ఆరాధనలు, వేంకటేశ్వర పూజలు, శనివార నియమములు, శనీశ్వర తైలాభిషేకములు, నవగ్రహములకు ప్రదక్షిణలు చేయుట వలన దోషములు ఉపశమించి, శుభములు అతిశయించును.

స్త్రీలు గురు శుక్రవార నియమములు పాటించుచూ, శ్రీరామ గణపతి రాజరాజేశ్వరీ అష్టోత్తర స్తోత్రపారాయణాలూ పూజలూ చేయుట వలన, సమస్త కార్యములుమా నిర్విఘ్నముగా కొనసాగుట, కుటుంబమందు సుఖశాంతులు, సంతానము వలన ఆనందములూ కలిగి చక్కటి అభివృద్ధిని పొందగలరు.

## కుంభరాశి

### (ధనిష్ఠ 3,4 పాదములు, శతభిషం 1,2,3,4 పాదములు, పూ.భా. 1,2,3 పాదములు)

ఆదాయం: 8 వ్యయం: 14 — రాజపూజ్యం: 7 అవమానం: 5

ఈ రాశివార్కి గురుడు 99 జనవరి 12 వరకూ జన్మమందు లోహమూర్తి. తదుపరి ద్వితీయమందు తామ్రమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు 2ట లోహమూర్తి. తదాది 3ట సువర్ణమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 7ట, కేతువు జన్మమందు లోహమూర్తులు. తదుపరి రాహువు 6ట కేతువు 12ట లోహమూర్తులు.

ఈ రాశివారికి గత $7\frac{1}{2}$ సంవత్సరముల నుండి నడుచుచున్న ఏల్నాటి శని సంచారము ఈ ఏప్రిల్ నందు తొలగుట ఆనందకరము. శని సువర్ణమూర్తి అయిననూ నీచరాశివలన సామాన్య ఫలితములిచ్చును. గురుడు 99 జనవరి వరకు జన్మమందు నైసర్గిక శుభత్వముచేత యోగించువాడుగా ఉన్నను, ప్రతి పనియందునూ ప్రతికూలత, ఆరోగ్య రీత్యా - భారీమార్పులు, వ్యవహార నిలబాటులు, వాదోపవాదములు, నరముల నిస్సత్తువ, పాండిత్య గోష్ఠి, భేషజములకు ధనవ్యయము, మరియు సన్మాన అలంకార ప్రాప్తి, సుఖభోగము, భవిష్యత్తుకు విశేష లాభసూచనలు కలిగించును. శని, ఏప్రిల్ నుండి వ్యాపార ఉద్యోగ కృషిలాభములు, గతములో కలిగిన బంధుమిత్ర శతృత్వ, అపవాద, నష్టధనాదులను తిరిగి క్రమముగా పొందగలుగుట కలిగించును. భూగృహ నిర్మాణాదులు, వ్యాపారాదులు, ఋణముతోనైననూ ఉత్సాహముగా ధైర్యముగా ఆచరించినచో పట్టినదల్లా బంగారమగును.

విద్యార్థులకీ సంవత్సరము అత్యధిక శ్రద్ధ లేకున్న ముందుకు సాగలేరు. గణిత, న్యాయవాద శాస్త్ర విద్యార్థులకు పరీక్షా కాలము. సైన్సు, ఆంగ్లము, భాషేతర విద్యార్థులకు, సాంకేతిక విద్యార్థులకు ఉన్నత విద్యలు కలుగును.

అన్నిరకముల అధికారులు - ఉద్యోగస్థులు కూడా పై అధికారుల దాడిని ఎదుర్కొనవలసి యుండును. వ్యవసాయ దారులకు కొంతవరకు మేలు.

కాంట్రాక్టర్లు, జాయింటుదార్లు, నిలవదార్లకు కొంతవరకు మేలు. మత్స్యములు, బియ్యము, వస్త్రములు, ఆహార వ్యాపారులకు, చేతి వృత్తుల వారికి, రసాయనిక వ్యాపారులకు 6,8,9,1 నెలలు కాక మిగిలిన నెలలు యోగదాయకములు, అపరాలు, ధాన్యము, స్టేషనరీ, సినీ వ్యాపారులు, కోళ్ల ఫారములు, పశు వ్యాపారులు, తైల వ్యాపారులకు, స్వయంకృషి వృత్తుల వారికి 4,6,7,10,12,3 నెలలు విశేషములు. రాజకీయ వాదులకు, స్పెక్యులేషనుల వారికి అనుకూలము.

4,5 నెలలలో రాజకీయవాదులకు, వ్యవహార వేత్తలకు అనుకూలం. పిత్రార్జిత ఆస్తులలో మార్పు చేర్పులు, పుణ్యకార్యాలు, 7,8 నెలలలో అకాల భోజనాలు, ఔషధసేవ, ఇతరుల వల్ల వాదన, ప్రయాణంలో అజాగ్రత్తలు, అనవసర వ్యయం. 8వ నెల తుదినుండి ప్రగల్భ వచనాలు. శృంగారాభిలాష స్త్రీ పరాఙ్ముఖత. 9,10,11 నెలలు ఇబ్బందులు, శతృభీతి, నీచులతో కలహం, వివిధ అనారోగ్యాలు, బహువిధ చికాకులు. కార్యభంగం. 11,12 మాసాలు ఆదిలో కష్టం. చివరిలో సుఖప్రదం. 1,2,3 నెలలు యోగదాయకంగా ఉంటాయి. మొత్తం మీద ఈ రాశివారికి 4,5,12,1,2,3 నెలలు తప్ప, తక్కిన నెలలు జాగ్రత్త అవసరము.

ధనిష్ఠవారికి పగడం, పుష్యరాగములు - శతతార వారికి వజ్ర గోమేధికాలు - పూర్వాభాద్ర వారికి నీలపుష్య రాగాభరణం ధరించిన మేలు కలుగును.

ఈ రాశివారి అదృష్ట సంఖ్య 8. 1,3,6,7 సంఖ్యలు, తేదీలతో కలసివచ్చు ఆది, గురు, శుక్ర, శనివారములు విశేష యోగప్రదములు.

మొత్తము మీద ఈ రాశివారికి సంవత్సరం మధ్యయందు కొన్ని ప్రయత్నములు పనికిరానట్లుగా అనిపించును. కొద్ది గ్రహప్రభావము చేత వెడి మరల వేరొక మార్గమున సుగమమగును. తరచు శని, గురు కేతు గ్రహములకు జపశాంతులు, రుద్రాభిషేకములు, పార్వతీ, గణేశ్వర, రామచంద్ర పూజలు జరిపించినచో కుటుంబమునకు మేలు.

స్త్రీలు శుక్ర, మంగళవార నియమములు చేయుట ద్వారానూ - సూర్య, సుబ్రహ్మణ్య, అంగారక పూజలు జరిపించుట వలన (గర్భిణీ సుఖప్రసవము) ఋణ విమోచన, ఆరోగ్యం, భర్తృపుత్ర సౌఖ్యములు, ధనవృద్ధి కలుగును.

## మీనరాశి

### (పూ.భా. 4వ పాదము, ఉ.భా. 1,2,3,4 పాదములు, రేవతి 1,2,3,4 పాదములు)

ఆదాయం: 5 వ్యయం: 5 రాజపూజ్యం: 3 అవమానం: 1

ఈ రాశివార్కి 99 జనవరి 12 వరకు గురుడు 12ట సువర్ణమూర్తి. తదుపరి జన్మమందు రజతమూర్తి. శని ఏప్రిల్ 17 వరకు జన్మమందును తదాది 2టను సువర్ణమూర్తి. 99 జనవరి 11 వరకు రాహువు 6ట, కేతువు 12ట సువర్ణమూర్తులు. తదుపరి రాహువు 5ట, కేతువు 11ట తామ్రమూర్తులు.

ఈ రాశివారికి గురుడు 98 అంతయు వ్యయమందు వ్యయప్రయాసలు శ్రమ, త్రిప్పట, మనో అశాంతి, సంతాన వ్యాపార వ్యవహారముల గురించి తొందర, స్థానచలన ఆలోచనలు, భూగృహ నిర్మాణములందు ఆటంకములు, ఆర్థిక సర్దుబాటులందు నిలబాటులు, ఒకానొక సమయమున చేతికి ధనము ఏదోవిధముగా అందినట్లనిపించినా నిలవకుండుట, ప్రతి వ్యవహారము కలిసొచ్చిన భ్రమ, క్రియలో శూన్యత, అయిననూ శుభకార్యములు, దైవకార్యముల రీత్యా విచ్చలవిడిగా ధనవ్యయము, భోజన సౌఖ్యం, బంధువుల మెప్పుకై ప్రయత్నములు కలుగును. ద్వితీయ శని కేవలము కుటుంబ ఆర్థిక రీత్యా అపకారిగా చెప్పుచున్ననూ నీచగావున దుష్ఫలితములందించక తటస్థతను చెందును. అంగారక గురు - రాహు గ్రహములకు శాంతి జరుపుట వలన ప్రత్యక్షముగా కాకున్నను పరోక్షముగా తెలియని మంచి ఫలితములు కలుగును. పిత్రార్జిత ఆస్తులు గురించి కంగారుపడిన దక్కక పరహస్తమగును.

విద్యార్థులకు గణపతి, సరస్వతి, దక్షిణామూర్తి ధ్యానము చేసినచో కొద్దిమంది ఉన్నత విద్యలనొందుటకు, విదేశములు వెళ్లుటకు అవకాశములున్నవి. గణిత, ఆంగ్ల, భాషేతర విద్యార్థులకు న్యాయవాద, సాంకేతిక, శాస్త్ర విద్యార్థులకు ఉత్తమ ఫలితములుండును. ఇంజనీర్లు, వైద్యులు, సమస్యలపై ప్రజాతీర్పు కోరవలసి వచ్చును. ఉపాధ్యాయ, ఆర్థిక శాఖ ఉద్యోగులకు 4,6,9,10,12,2 మాసములు బహు జాగరూకత అవసరము.

కంట్రాక్టులు, నిలవలు, జాయింట్లు యోగించవు. తాత్కాలిక నిత్యకృత్యావసర వస్తు వ్యాపారులకు ఉపాధికి లోటు ఉండదు. నట గాయకులకు తాత్కాలిక శ్రమ అధికంగా ఉన్ననూ భవిష్యత్ నందు విశేష యోగములు కలుగును.

రాజకీయములు అనుకూలించి చేజారును. రైస్‌మిల్లర్లు, యాంత్రిక వ్యాపారులకు ధనవ్యయముచే కొంత వరకు లాభము కలుగును. సినీ పరిశ్రమల వారికి, ఆర్థిక వ్యాపారులకు దోరణి మార్చుట మేలు. ఇనుము, యంత్రాలు, తైలాలు, కిరాణా, అపరాలు, ఎరువులు, స్టేషనరీ, వస్త్ర వ్యాపారులకు క్రమముగా వృద్ధి కలుగును.

6,7 మాసాలలో క్రమ క్రమోత్సాహం, కొంత మానసికానందం, స్వకార్య లాభాలు, నష్టద్రవ్య లాభం, మాతృసౌఖ్యం, పితృవర్గ మైత్రి, అలంకార ప్రాప్తి తరచు ప్రయాణాలుంటాయి. అపూర్వమైన వస్తువులు సేకరిస్తారు. 9 నెలలో సంతానారోగ్యం కుదుటపడినా స్వకీయ మనో అస్థిమితం తప్పదు. 10,1నెలలలో శతృమూలక మేళ్లు, మంచివాక్కు వలన

ఆదాయం, తరచు ప్రయాణాలు, మంత్రయంత్ర విషయాసక్తి కొద్దిపాటి వైరాగ్యం, నడుముకు సంబంధించిన అనారోగ్యం, శస్త్రచికిత్సలు సూచింపబడుతున్నాయి. దుష్టభాషణం, అధిక వ్యయం తగ్గించుకోవాలి. 1,2,3 నెలలు వీరికి విశేషమైన యోగకాలము. సమస్త శుభకార్యాలకీ అనువైన కాలము. కీర్తి, ఆకస్మిక ధనలాభం, వివాహ భూ, గృహ క్రయ విక్రయ నిర్మాణాదులకీ తగిన సమయం.

పూ. భాద్ర వారు నీలం, పుష్య రాగాభరణములు - ఉ.భాద్ర వారు పగడము నీలములను - రేవతి వారు పచ్చనూ ధరించినచో గతముకంటె మేలుగా ఉండును.

వీరి అదృష్ట సంఖ్య 3. 1, 2, 9 సంఖ్యలు, తేదీలతో కలసినచ్చు ఆది, సోమ, మంగళ వారములు యోగ్రపదములు.

ఈ రాశివారు తరచు మంగళవార నియమములూ, అంగారక స్తోత్రజపాలూ, ఈశ్వరాభిషేకములు, ఆంజనేయ సహస్రనామ పూజలు, శనీశ్వర తైలాభిషేకములు, సూర్యారాధనలు చేయుట వలన మేలు కలుగును.

స్త్రీలు ఆది, గురువార నియమములు, శివ సహస్రనామాలు, చంద్రశేఖ రాష్టకములు గౌరీపూజలు చేయుచుండుట, పగడం ధారణవలన - అనారోగ్యములు తొలగి ఆనందములు కలిగి సంసారము సుఖమయముగా సాగును.

* * *

## శుభముహూర్తముల సందర్భము

ఇందు బాహుళ్యముగ శుభముహూర్తములను నిర్ణయించి వ్రాసితివి. ఇందు వ్రాయబడిన వానికి స్వల్ప దోషములున్నను వాటికి పరిహారములను గమనించియే వ్రాయబడినవి. ఏకవింశతి మహా దోషములు, ఉపదోషములు, మీన చైత్ర, లత్తా, వేధలు మున్నగు వాటికిని దేశవ్యవస్థలను గమనించి వ్రాయబడినవి. కేవలము నిర్దుష్టమగు లగ్నములు సంవత్సరమునకు 3,4, గూడ దొరకుట కష్టము. సుప్రసిద్ధ సిద్ధాంతులును చిరకాలమునుండి గుణదోషములను నిరూపణ చేయుటయు వ్రాయుటయుగలదు. మరియు ప్రజాబాహుళ్యమునకు ఉపయోగించుకొనుటకు కొంతవరకు ముహూర్తములు వ్రాయబడినవి. సహృదయులు వాటిని గమనించి క్షీరనీర న్యాయముగా గ్రహించి ఆచరణ యోగ్యములగు వాటిని ప్రజలకు అందచేయవలసినదిగా మనవి చేయుచున్నాను. -- పంచాంగకర్త.

# శుభముహూర్తాని

## చైత్ర మాసము (29-3-98 నుండి 26-4-98 వరకు)

మార్చి 29 ఆది. శు. విదియ. రేవతి. వత్సరాదిత్వేన నవవస్త్రాభరణ ధారణ, క్రయ, విక్రయ రాజ దర్శనాదీనాం వృషభోర ఉ.గం. 9-50. డోలారోహణక్రయవిక్రయాదీనాం కర్కాటకో మతాంర ప.గం. 1-34

ఏప్రిల్ 1 బుధ. పంచమి. రోహిణి. అన్నప్రాశన వివాహ ఉపనయన అక్షర స్వీకారస్య వృషభశ్చేరః ఉ.గం. 9-34. వివాహ, గర్భాదానాదీనాం వృశ్చికోర రా.గం. 9-57. వివాహస్య మకరోర రా.గం. 2-39.

2 గురు. షష్ఠి. మృగశిర. అన్నప్రాశనోపనయన అక్షరస్వీకార వివాహాదీనాం మేషోవసుః ఉ.గం. 8-2. వివాహ గర్భాధానాదీనాం తులా చోరః రా.గం. 8-57.

3 శుక్ర. సప్తమి. ఆర్ద్రా. గర్భాదానస్య తులార రా.గం. 8-52.

4 శని. అష్టమీ.పునర్వసు. డోలారోహణస్య మిధునంర ప.గం. 12-11.

5 ఆది. నవమీ. పుష్యమి. డోలారోహణస్య మిధునంర ప.గం. 12-6. కర్కాటకో మతాంర ప.గం. 1-04. వృశ్చికోర రా.గం. 9-41.

9 గురు. త్రయోదశి. పుబ్బ. వృషభో మతాంర ఉ.గం. 9-3. ఉత్తర డోలారోహణ క్రయ విక్రయాదీనాం కర్కాటకోర ప.గం. 12-49. వివాహస్య మకరో మతాంర రా. 2-07.

10 శుక్ర. చతుర్దశి. హస్త. వివాహస్య వృశ్చికోర రా.గం. 9-23.

11 శని. పూర్ణిమా. హస్త. డోలారోహణ క్రయ విక్రయాదీనాం కర్కాటకోర ప.గం. 12-42.

12 ఆది. పాడ్యమి. చిత్త. అన్నపాశన క్రయ విక్రయాదీనాం వృషభోర ఉ.గం. 9-51.

15 బుధ. చవితి. అనూరాధ. అన్నపాశనోపనయన, అక్షరస్వీకార, వివాహ, విద్యారంభ, క్రయ విక్రయాదీనాం వృషభోర ఉ.గం. 8-40. వివాహగర్భాదానయోః వృశ్చికోర రా.గం. 1-43.

17 శుక్ర. షష్ఠి. మూల. వివాహగర్భాధానస్య వృశ్చిక రా.గం. 8-53.

19 ఆది. అష్టమీ. ఉ.షా. వివాహస్య ధనూర రా.గం. 11-56. మకరోర రా.గం. 1-27.

## వైశాఖ మాసము (27-4-98 నుండి 25-5-98 వరకు)

ఏప్రిల్ 28 మంగళ. శు.విదియ. రోహిణి. వివాహస్య మీనోర రా.గం. 3-55.

30 గురు. చవితి. మృగశిర. అన్నప్రాశనోపనయన, అక్షరస్వీకార, వివాహ గృహారంభ ప్రవేశ క్రయ విక్రయాదీనాం మిధునంర ఉ.గం. 7-40.

మే 1 శుక్ర. షష్ఠి. ఆర్ద్రా. ఆశ్వలాయనోపనయనస్య మిధునంర ఉ.గం. 10-26.

2 శని. సప్తమి. పునర్వసు. డోలారోహణక్రయవిక్రయా కర్కాటకోర ఉ.గం. 11-19. పుష్యమి. గృహప్రవేశ, గర్భాధానస్య వృశ్చికో ర రా.గం. 7-57.

3 ఆది. సప్తమి. పుష్యమి. అన్నప్రాశన, ఉపనయన, అక్షరస్వీకార, గృహారంభ ప్రవేశాదీనాం వృషభోర ఉ.గం. 7-29. కర్కాటకోర ఉ.గం. 11-16.

6 బుధ. దశమి. ఉత్తర. వృశ్చికోర రా.గం. 7-41. ఉత్తర. వివాహ గృహప్రవేశస్య ధనూర రా.గం. 10-52.

7 గురు. ఏకాదశి. ఉత్తరః అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార, వివాహ, విద్యారంభ, గృహారంభ ప్రవేశాదీనాం వృషభోర ఉ.గం. 7-15. హస్త. వివాహనిషేకాదీనాం ధనూర రా.గం. 10-48.

8 శుక్ర. ద్వాదశి. హస్త. అన్నప్రాశనస్య మిధునంర ఉ.గం. 10-0. వివాహ గర్భాదానాదీనాం వృశ్చికోరాజా రా.గం. 7-34. ధనూర రా. 10-45.

9 శని. చతుర్దశి. చిత్త. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కన్యార ప. 3-41. గర్భాదాన, గృహప్రవేశాదీనాం వృశ్చికోర రా.గం. 7-30.

10 ఆది. చతుర్ధశి. స్వాతి. డోలారోహణ క్రయ విక్రయాదీనాం కన్యార ప.గం. 3-37. వివాహస్య వృశ్చికోర రా.గం. 7-26. ధనుర్మతాంర రా.గం. 10-36.

13 బుధ. విదియ. అనూరాధ. అన్నప్రాశనోపనయన, అక్షర స్వీకార, వివాహ యాత్రాక్రయవిక్రయా, దేవతాప్రతిష్ఠాదీనాం వృషభోర ఉ.గం. 6-54, మిధునమపి వసుః ఉ.గం. 9-41.

16 శని. పంచమీ. ఉ.షా. డోలారోహణ క్రయ విక్రయాదీనాం కన్యార ప.గం. 3-14.

17 ఆది. షష్ఠి. ఉ.షా. అన్నప్రాశనోపనయన అక్షరస్వీకార, వివాహక్రయ విక్రయాదీనాం కర్కాటకోర ఉ.గం. 10-23. శ్రవణం డోలారోహణక్రయ విక్రయాదీనాం కన్యావసుః ప.గం. 3-11.

18 సోమ. సప్తమి. శ్రవణం. అన్నప్రాశనోపనయన క్రయవిక్రయాదీనాం కర్కాటకో వసుః ఉ.గం. 10-18. ధనిష్ఠ - గర్భాధానాదీనాం ధనుర్మతాంర రా.గం. 10-5.

20 బుధ. నవమీ. శతభిషం. అన్నప్రాశనోపనయన అక్షరస్వీకార, వివాహ క్రయవిక్రయాదీనాం మిధునం రాజా ఉ.గం. 9-13, గర్భాధానస్య ధనూర రా.గం. 9-57.

21 గురు. దశమీ. ఉ.భా. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార, వివాహ, గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం మిధునం మతాంర ఉ.గం. 9-10.

## జ్యేష్ఠ మాసము (26-5-98 నుండి 24-6-98 వరకు)

మే 27 బుధ. విదియ. మృగశిర. అన్నప్రాశనోపనయన, అక్షర స్వీకార, వివాహ యాత్రా, క్రయవిక్రయాదీనాం మిథునంర ఉ.గం. 8-46, కర్కాటకో మతాంర ఉ.గం. 9-42.

28 గురు. చవితి. ఆర్ద్రా. గర్భాధానస్య ధమర్మతాంర రా.గం. 9-25.

29 శుక్ర. చవితి. పునర్వసు. డోలారోహణక్రయవిక్రయాదీనాం కన్యార ప.గం. 2-22. పుష్యమి. గృహప్రవేశస్య మీనోర రా.గం. 1-53.

31 ఆది. సప్తమి. మఖ. వివాహస్య మీనో మతాంర రా.గం. 1-44 (ఽ-చంద్రః).

జూన్ 3 బుధ. నవమీ. ఉత్తర. డోలారోహణస్య కన్యామతాంర ప.గం. 2-02, వివాహ, గర్భాధాన గృహప్రవేశాదీనాం ధమార రా.గం. 9-01, వివాహస్య మకరో మతాంర రా.గం. 10-31, వివాహ గృహప్రవేశాదీనాం మీనోర రా.గం. 1-32.

4 గురు. దశమీ. హస్త. అన్నప్రాశనోపనయన, అక్షరస్వీకార, వివాహ, యాత్రా, క్రయవిక్రయాదీనాం మిథునం మతాంర ఉ.గం. 8-14, కర్కాటకోర ఉ.గం. 9-10, వివాహస్య మీనోమతాంర రా.గం. 1-29.

5 శుక్ర. ఏకాదశి. చిత్త. అన్నప్రాశనోపనయనాక్షరస్వీకార క్రయవిక్రయాదీనాం మిథునంర ఉ.గం. 8-7.

6 శని. ద్వాదశి. స్వాతి. వివాహగర్భాధానాదీనాం ధనూర రా.గం. 8-51, మకరోమతాంర రా.గం. 10-20.

7 ఆది. త్రయోదశి. స్వాతి. అన్నప్రాశనోపనయన, అక్షరస్వీకార, వివాహ, విద్యారంభ క్రయవిక్రయాదీనాం మిథునంర ఉ.గం. 8-3. కర్కాటకోమతాంర ఉ.గం. 9-0.

11 గురు. విదియ. మూల. డోలారోహణ క్రయవిక్రయాదీనాం కన్యార ప.గం. 1-32.

12 శుక్ర. తదియ. ఉ.షా. గర్భాధానాదీనాం మకరో మతాంర రా.గం. 9-58, వివాహ గృహప్రవేశాదీనాం మీనో మతాంర రా.గం. 12-59.

13 శని. తదియ. ఉ.షా. అన్నప్రాశనోపనయన అక్షరస్వీకార వివాహ యాత్రా క్రయవిక్రయాదీనాం కర్కాటకో మాపాదిరహితః ఉ.గం. 8-37. శ్రవణం. గృహప్రవేశ వివాహాదీనాం ధనూర రా.గం. 8-24, వివాహ గర్భాధానస్య మకరోర రా.గం. 9-52.

14 ఆది. చవితి. శ్రవణం. అన్నప్రాశనోపనయన, అక్షరస్వీకార, వివాహక్రయవిక్రయాదీనాం కర్కాటకో మతాంర ఉ.గం. 8-34, డోలారోహణ క్రయవిక్రయాదీనాం కన్యార ప.గం. 1-22. ధనిష్ఠ. వివాహ, గర్భాధానస్య మకరోర రా.గం. 9-51 (లగ్నచంద్రః).

17 బుధ. అష్టమీ. ఉ.భా. వివాహస్య మకరోర రా.గం. 9-42, వివాహ గృహప్రవేశాదీనాం మీనోర రా.గం. 12-42.

18 గురు. నవమీ. ఉ.భా. అన్నప్రాశనోపనయన అక్షరస్వీకార వివాహక్రయవిక్రయాదీనాం కర్కాటకో మతాంర ఉ.గం. 8-20. రేవతి. వివాహ గర్భాధానాదీనాం మకరో మతాంర రా.గం. 9-38, వివాహ గృహప్రవేశాదీనాం మీనోర రా.గం. 12-39.

19 శుక్ర. ఏకాదశి. అశ్విని. వివాహస్య మీనోర రా.గం. 12-34.

## ఆషాఢ మాసము (25-6-98 నుండి 23-7-98 వరకు)

జూలై 1 బుధ. సప్తమి. ఉత్తర. అన్నప్రాశనస్య కర్కాటకోర ఉ.గం. 7-27.

2 గురు. అష్టమి. హస్త. అన్నప్రాశన కర్కాటకోర ఉ.గం. 7-24, డోలారోహణస్య కన్యార ప.గం. 12-12.

3 శుక్ర. నవమి. చిత్త. అన్నప్రాశనస్య కన్యామతాంర ఉ.గం. 7-19.

6 సోమ. ద్వాదశి. అనూరాధ. అన్నప్రాశనస్య కర్కాటకో వసుః ఉ.గం. 7-8.

10 శుక్ర. పాడ్యమి. ఉ.షా. డోలారోహణస్య కర్కాటకోర ఉ.గం. 6-52, డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 3-28.

11 శని. విదియ. శ్రవణం. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 3-24.

12 ఆది. తదియ. ధనిష్ఠ. అన్నప్రాశనస్య కర్కాటకోమతాంచోర ఉ.గం. 6-43, డోలారోహణస్య కన్యాచోరః ఉ.గం. 11-31.

15 బుధ. షష్ఠి. ఉ.భా. అన్నప్రాశనస్య కర్కాటకో మతాంర ఉ.గం. 6-32. రేవతి. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 3-8.

16 గురు. అష్టమి. రేవతి. అన్నప్రాశనస్య కర్కాటకోమతాంర ఉ.గం. 6-28.

17 శుక్ర. నవమి. అశ్విని. డోలారోహణస్య వృశ్చికోమతాంర ప.గం. 3-01.

## శ్రావణ మాసము (24-7-98 నుండి 22-8-98 వరకు)

జూలై 25 శని. తదియ. మఖ. వివాహస్య మీనోర రా.గం. 10-13, వివాహస్య వృషభోర రా.గం. 2-7.

27 సోమ. పంచమి. ఉత్తర. గర్భాధాన గృహప్రవేశాదీనాం మీనోమతాంర రా.గం. 10-05.

29 బుధ. షష్ఠి. హస్త. వృశ్చికోరాజా ప.గం. 2-15, వివాహస్య మీనో వసుః రా.గం. 9-57.

ఆగష్టు 2 ఆది. దశమి. అనూరాధ. డోలారోహణస్య క్రయ విక్రయాదీనాం వృశ్చికోర ప.గం. 1-58, వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం మీనో మతాంర రా.గం. 9-40.

6 గురు. చతుర్థశి. ఉ.షా. డోలారోహణ క్రయవిక్రయాదీనాం వృశ్చికోర ప.గం. 1-42. వివాహ గృహప్రవేశాదీనాం వృషభోర రా.గం. 1-20.

7 శుక్ర. చతుర్థశి. శ్రవణం. వివాహస్య వృషభోర రా.గం. 1-16.

8 శని. బ.పాడ్యమి. ధనిష్ఠ. డోలారోహణ క్రయ విక్రయాదీనాం వృశ్చికోర ప.గం. 1-35, వివాహ గృహప్రవేశస్య మీనోర రా.గం. 9-17, వృషభోపిర రా.గం. 1-12.

9 ఆది. విదియ. ధనిష్ఠ. అన్నప్రాశన, వివాహ, గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం కన్యార ఉ.గం. 9-42. శతభిషం. డోలారోహణ క్రయవిక్రయాదీనాం వృశ్చికోమతాంర ప.గం. 1-30, వివాహ గర్భాధాన గృహప్రవేశ మీనోర రా.గం. 9-13, వివాహ గృహప్రవేశస్య వృషభోర రా.గం. 1-8.

10 సోమ. తదియ. పూ.భా. గర్భాధానస్య మీనోమతాంర రా.గం. 9-8.

11 మంగళ. పంచమి. ఉ.భా. వృశ్చికోర ప. 1-2.

12 బుధ. పంచమి. రేవతి. అన్నప్రాశన వివాహ గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం కన్యాహోరః ఉ.గం. 9-31, ధనూర పా.గం. 4-30, వృశ్చికోమతాంర ప.గం. 1-19, వివాహగర్భాధాన గృహప్రవేశా దీనాం మీనోర రా.గం. 9-0.

13 గురు. షష్ఠి. అశ్విని. డోలారోహణక్రయవిక్రయాదీనాం ధనూర పా.గం. 4-25, వివాహస్య మీనోర రా.గం. 8-57, (సగ్రహచంద్రః) మిధునమపి మతాంర రా.గం. 3-40.

16 ఆది. నవమి. రోహిణి. డోలారోహణ, క్రయ విక్రయాదీనాం వృశ్చికో మతాంర శుభనవాంశకాలః ప.గం. 1-21, వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం మీనోర రా.గం. 8-45. మృగశిర వివాహ గృహప్రవేశాదీనాం వృషభోర రా.గం. 12-40.

17 సోమ. దశమి. మృగశిర. అన్నప్రాశన గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదీనాం కన్యార ఉ.గం. 9-10.

## భాద్రపద మాసము (23-8-98 నుండి 20-9-98 వరకు)

ఆగష్టు 27 గురు. పంచమి. స్వాతి. అన్నప్రాశనస్య కన్యారాజా ఉ.గం. 8-30.

30 ఆది. అష్టమి. అనూరాధ. అన్నప్రాశనస్య కన్యార ఉ.గం. 8-17, డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 12-6, ధనుర్మతాంర ప.గం. 3-16.

సెప్టెంబరు 4 శుక్ర. త్రయోదశి. శ్రవణం. డోలారోహణస్య ధనూర ప.గం. 2-56.

5 శని. చతుర్దశి. ధనిష్ఠ. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 11-41.

6 ఆది. పూర్ణిమా. శతభిషం. డోలారోహణస్య వృశ్చికోర ప.గం. 11-38, ధనుర్మతాంర ప.గం. 2-48.

## ఆశ్వయుజ మాసము (21-9-98 నుండి 20-10-98 వరకు)

సెప్టెంబరు 22 మంగళ. విదియ. హస్త. క్రయవిక్రయాదీనాం వృశ్చికోమతాంర ప.గం. 10-32.

23 బుధ. తదియ. చిత్త. డోలారోహణస్య క్రయవిక్రయాదీనాం ధనూర ప.గం. 1-39.

26 శని. షష్ఠి. అనూరాధ. డోలారోహణస్య ధనూర ప.గం. 1-27.

30 బుధ. నవమి. ఉ.షా. అన్నప్రాశనస్య వృశ్చికోమతాంర ఉ.గం. 10-01, డోలారోహణస్య మకరోర ప.గం. 2-42.

అక్టోబర్ 1 గురు. ఏకాదశి. శ్రవణం. విజయముహూర్తకాలః ప.గం. 2-14. మకరోర ప.గం. 2-39.

2 శుక్ర. ద్వాదశి. ధనిష్ఠ. డోలారోహణస్య మకరోమతాంర ప.గం. 2-35.

3 శని. త్రయోదశి. శతభిషం. డోలారోహణస్య ధనుర్మతాంర ప.గం. 12-59.

5 సోమ. పూర్ణిమా. ఉ.భా. అన్నప్రాశనస్య వృశ్చికశ్చోరః ఉ.గం. 9-39.

7 బుధ. విదియ. అశ్విని. అన్నప్రాశనస్య వృశ్చికోమతాంర ఉ.గం. 9-32.

10 శని. పంచమి. రోహిణి. డోలారోహణ క్రయవిక్రయాదీనాం ధనూర ప.గం. 12-31.

